# అశ్వలక్షణసారసంగ్రహము.

అడవి సాంబశివరాయ ప్రణీతము.

మూడవ కూర్పు 1000 ప్రతులు.



ఏలూరు

మంజువాణీముద్రాక్షరశాల

1925





(Price 6 annas

3

శ్రీ మార్తాండ పరబ్రహ్మణేనమః



# అర్కలక్షణ సారసంగ్రహము.




రాజిల్లం ద్రయీస్వరూపత ద్రిమూ-ర్తిప్రాభవాస్ఫూర్తిలో
కారాధ్యుండు ద్రికాలసత్యుఁడు ద్రికృ-
త్యాధ్యుండునై భూరితే। జోరూపంబున వెల్గువెల్గు
కరుణాస్ఫూర్తిన్ ఘటించున్నిరూ। ఆరోగ్యాయు
రుదారసంపదలుమా-కర్కుప్రసన్నాత్మతన్ ॥ 1

క. నిత్యానపాయినిగఁ బతి
కత్యంత ప్రీతి జాయ-యన నలరి బుధ
స్తుత్యప్రభావయగు సతి
యత్యుజ్జ్వల విభవధాత్రి-యయ్యెడు మాకున్ ॥ 2

క. విద్యారూపిణియై శ్రుతి
వేద్య సమంచ త్ప్రభావ • విశ్రుత యగు నా
విద్యాదేవి దయామతి
హృద్య కవిత్వ ప్రభావ • మిడు మా కెప్డున్ ॥ 3

క. భూరి ప్రత్యూహౌఘశ
తారుంబహుశేప్సితార్థ • దానామృత దీ

త్సారంభుని సేవించెద
హేరంబు న్సకల సుకవి • హిత సంరంభున్ ॥ 4

కి. నానా పురాణ కావ్య వి
ధానంబుల వాగ్వధూటి • ధాత్రిం గృతసం
ధాన నొనరించుఁ బుణ్యయ
శో నిధుల స్సుకవి విధుల • జోక భజింతున్ ॥ 5

క. అసమాన సాహితీ రస
విసర ద్బహుకావ్య దోష • విశదా శ్రయతా
లసమాన ముఖుల విబుధా
గ్రసరులఁ గ్రేగంటఁ జూడఁ • గాఁ బ్రార్థింతున్ ॥ 6

వ. ఇట్లు ప్రాదీప్సిత గ్రంథనిర్విఘ్న పరిసమాప్తి సంప్రదాయా విచ్ఛిన్న లక్షణ నిబంధనంబుగ స్తుత్యస్తోత్ర పరాయణుండనై.

సీ. అఖిల రాజాధి రా • జాస్థాన కార్యని,
ర్వహణ ప్రవీణతా • వహ నియోగి
సత్కులంబున యశ • స్సమధి కొడవి వంశ,
కలశాబ్ధి చంద్రుడై • కలిగె సుబ్బ
రాయఁడాతనిపుత్ర • రత్నముల్ పాపయ,
రామశాస్త్రులు బుధా • గ్రణులు వారి
యందుఁ బాపయమంత్రి • యర్ధాంగ లక్ష్మియౌ
సీతమాంబిక యందు • శ్రీమహేశ

గీ. పదసరోజ సపర్యా ప్ర • భావమునను
వను నఖిల సత్కవీంద్రవం•దన గుణైక
శోభితాత్ముని సాంబశి•వాభి ధేయుఁ
గనిరొ వరభాగధేయు స•జ్జన విధేయు ॥

వ. ఇట్టియేను.

చ. ఘనతర వాగ్విభూతి శత ♦ కంబులు గొన్నిటిఁ గొన్ని కావ్యము
లైనను కవిత్వ వైఖరుల ♦ ధీరులు మెచ్చ నొనర్చి వెండియుఁ
జనులకు నెల్లకాలముఁ బ్ర ♦ శంసకు రాఁగల యట్టి కావ్యముం
బనుపడఁజేయఁబూని యన ♦ వద్యమతిం దలపోయు చుండఁగన్

సీ. ఘనమైన మంత్రిప్రె ♦ గ్గడ వంశ కలశాబ్ధి,
కెవ్వాని యవతార ♦ మిందురేఖ
లక్ష్మీవరంబు వే ♦ ల్లయు నన్న పరగణా
లెవ్వాని పాలన ♦ మిష్టసుఖద
మనవద్య సకల వి ♦ ద్యావైదుషీ శ్రీకె,
వాని మానసము క్రీ ♦ డా నివాస
మఖిల విద్వత్కవీం ♦ ద్రాబ్జ షండమునకె
వ్వాని సమ్ముఖము భా ♦ స్వత్ప్రకాశ

గీ. మారయగ నుర్వి గల జమీన్ ♦ దారులందు
నెవని పేరు మహాఖ్యాతి ♦ నెసక మెసఁగె
నట్టి రాజాభుజంగరా ♦ యాహ్వయుండు
కరుణ దైవారగా నన్నుఁ ♦ గని వచించె॥

చ. అనుపమ వాగ్విభూతి మెఱ ♦ యంగభుజంగనృపాలశేఖరా
యను శతకాగ్ర గణ్యము మ ♦ దంకితమై యొనరంగ నీవు చే
సిన యది మామనంబునను ♦ జిక్క సుధారసమాధురీణమై
విన విన మాటిమాటికి న ♦ వీనముగా బ్రియ మాపతింపుచున్

చ. అని యచలాత్మజాపరిణ ♦ యాదిప్రబంధములీవు మున్ను చే
సిన యవి వింటి మామధుర ♦ చిత్రకవిత్వపదార్థశుద్ధి చే
రొక్కనఁదగి యుండె నీయెడలఁ ♦ గూర్పదలంచు నవీనకావ్యమున్
జనువుదలిర్ప వేఁడెద నొ ♦ సంగుము మాకది యంకితంబుగన్

చ. అతి శుభవైభవంబులకు ♦ నశ్వము లాకరమంచు మున్ను స
న్మతులు వచించి రయ్యది య ♦ థార్థము వాహన రాజియందు నా

ర్జిత కమలాస్పదంబును వ • రిష్ట తురంగము మందుమాకుసం
తత హయధాటికా పటిమ • దద్దయు నెమ్మదిలో మెలంగెడున్

క. అరసి తురంగములకును
సురుచిర శుభలక్షణములు • నూడంగవలె నం
దురు పెద్దలు హయలక్షణ
విరచన బహుశాస్త్ర తంత్ర • వేద్యమగు నిలన్॥ 13

గీ. వలయు శాస్త్రంబులెల్ల గీ • ర్వాణభాష
నాదిమునులొనరించి ర • య్యవియుఁ గేవ
లాంధ్రభాషా ప్రచారుల • కరసిచూడ
దురవగాహంబులగుచుండు • ధరణియందు॥ 14

గీ. అశ్వశాస్త్రంబునం గల • దాంధ్రభాష
నదిసుబోధము సక్రమ • మభినుతంబు
గామి హయలక్షణంబుల • గాథ తెలుఁగఁ
జాలు శాస్త్రంబు కొదువ యి • క్కాలమునను॥ 15

క. ఇది జనసామాన్యమునకు
వదలక సెల్లడలఁ గడు న • వశ్యముగానన్
సదమల హయలక్షణముల
విదితమ్ముగఁ జేయుగ్కృతిఁ బ్ర • వీణత మెఱయన్॥ 16

ఆ. నాతివిస్తరంబు • నన్యసాపేక్షితం
బగు తెలుంగు మీఱ • నశ్వలక్ష
ణముల సారమెల్ల • నలరంగఁ గృతిఁ జేసి
మాకొసంగు సుకవి • లోకమలర॥ 17

వ. అని సబహుమానంబుగ నానతిచ్చుటయు

మ. అనవద్య ప్రతిభాగ్రహీత బహువి • ద్యాస్పదశ్రీ భోజరా
జనగాఁ జాలఁ గవిత్వతత్త్వనిలయుం • డష్టావధానక్రియా

చణుఁ డుద్యద్గుణ గుంభ సంభరితుఁ డీ ♦ క్ష్మాదేవతా వంశపా
వనుఁడౌ భూపతి యీకృతిం గనుట నా ♦ భాగ్యంబుగా కల్పమే
ఆ. అని తలంచి యట్లు ♦ యశ్వలక్షణసార
సంగ్రహంబనంగ ♦ సంఘటింతుఁ
గృతికి తదంకితముగ ♦ వితత యశోద్భాస
ద్వంశ మహిమఁ దెలియఁ ♦ బలుకు మొదల॥ 19

## కృతి పతి వంశావతార వర్ణనము.

చ. అతుల ధరాతలేశ్వర స ♦ భాంతర సంస్తవనీయ శేముషీ
వితత యశః ప్రసక్త బుధ ♦ విశ్రుతులై తగు నాఱువేల సం
జ్ఞితులు నియోగివంశజు ల ♦ నిందిత వేద తదంగ వేది తా
న్వితులుఁ ప్రబంధ కర్తలు ప ♦ విత్రులు బ్రహ్మకులైక మండనుల్
ఆ. ఆ నియోగివంశ ♦ మందు మంత్రిప్రెగ
డాన్వయంబు జలధు ♦ లందు పాల
కడలి భాతిఁ గీర్తిఁ ♦ గలిగి యనూన సం
పత్ప్రభావ పటిమఁ ♦ బరగు చుండు॥ 21
చ. హారితస గోత్ర విశ్రుత మ ♦ హత్వము గల్గి యనూన కీర్తిచే
నరుదగు మంత్రిప్రెగ్గడ మ ♦ హాన్వయమందు జనించి మేదినీ
భరణ విశాల వైభవ వి ♦ భాసితుఁడై నిజకీర్తి చంద్రికా
స్ఫురిత దిగంతరుండగుచుఁ బొల్చు భుజంగ నృపాలుఁ డిద్ధరన్॥
క. రాజా బహదర్ బిరుదు వి
రాజితముగఁ దాల్చి సకల ♦ రాజ సభా సం
పూజిత వైభవ మెసఁగన్
దేజరిలెన్ భుజగరాయ ♦ ధీమణి ధరణిన్॥ 23
శా. కట్టించెన్ జనులెల్లఁ దృప్తినొనరం ♦ గా నన్నసత్రంబులం
బెట్టించెన్ బహుసత్ఫలప్రదములై ♦ వెల్గొందు నారామముల్

నెట్టించెఁ నిజదాతృతా గరిమ ను ♦ న్నిద్రార్థి దారిద్రముల్
పుట్టించెఁ దిశల స్వేలుంగఁగఁ బరి ♦ స్ఫూర్జద్యశ శ్చంద్రికల్॥

సీ. భూరి మహీభార ♦ ధౌరేయతఁ దనర్చి,
ఘన మహాభోగసం ♦ గతి నెలర్చి
వర్ణిత బహుముఖా ♦ వాప్తి విద్యల మించి
సర్వజ్ఞ భూషణ ♦ సరణిఁ గాంచి
యనుపమాంతర్హ్లాద ♦ యస్థ విష్ణుత నొప్పి
కుండలి చయము మ ♦ కుటనను మన్పి
లస దహీన ప్రభు ♦ త్వ సమాఖ్య నెసకొల్పి
గరిమ ననంత వి ♦ ఖ్యాతిఁ జెల్పి

గీ. వెలసె నసమాన నైర్మల్య ♦ వినుత మూర్తిఁ
పర మహీభృద్దురాపరి ♦ హరణకీర్తిఁ
యగుచు నిల మంత్రి పెగడవం ♦ శాంబు రాశి
సరస గుణపాళి భుజగరా ♦ జన్యమౌళి॥ 25

మ. పరికింపం బురుషోత్తముండతడు సౌ ♦ భాగ్య ప్రభాయుక్తుడై
వరియించెం బరమోద్యమంబునఁ జతు ♦ ర్వర్గంబులంబోలె భా
సుర సౌభాగ్య పతివ్రతాత్మమహిమా ♦ స్తోత్రార్హ చారిత్ర సు
స్థిరలం జిన్నమ శేషమాతరుణులన్ ♦ సీతమ్మ రంగమ్మలన్.

శా. పాతివ్రత్య మహాప్రభావకలనం ♦ బ్రత్యక్ష గారుంధతుల్
దాతృత్వంబున యంద పూర్వ దివిష ♦ ద్ధాత్రీజ సంతానముల్
ఖ్యాతిన్ భర్తృహితానురాగముల సా ♦ క్షాదిందిరా సుందరుల్
బ్రీతిన్ మించు భుజంగరాయమణి దేవేరుల్ ప్రశంసింపఁగన్

వ. అందు.

సీ. చాంచల్య భావయన్ ♦ సడిబాపుకొన భువిఁ,
గలిగిన కలశాబ్ధి ♦ కన్యయొక్క—

చండికాభిఖ్య గ్ర • చ్చుణి దీర్చికొన నుర్వి,
జనియించు నచలేంద్ర • తనయ యొకతె
పలునోళ్ళ బడ్డర • చ్చులమాటితన మీఁగ
నిలఁ బుట్టు పలుకుల • వెల్లఁది యొకతె
యతి హీన కులజాతి • యను నారడి దొలంగ
క్షితిజనించిన యరుం • ధతియయొకతె

గీ. యన బటుస్థైర్య సుప్రసా • దాతి వినయ
సమధికతరాభిజాత్య వి • భ్రమము నొప్ప
సతుల పతిభక్తి గౌరవా • వాప్తి మెఱసె
భవ్య గుణపేటి శేషమాం • బా వధూటి ॥ 28

వ. ఇట్లున్న యాసతీచతుష్కమునందు

మ. ఘనతేజఃప్రతిభా సముగ్రుఁడు భుజం • గక్ష్మాధిరాణ్మౌళికిన్
జనియించెం బతిదేవతా తిలకతాం • చచ్చిన్నమాదేవియం
ద నఘశ్రీనిధి యుర్వరావనచణుం • డౌచంద్రచూడుం డితం
డన దుర్గాన్విత మల్లిఖార్జునప్రసా • దాఖ్యుం డుదారస్థితిన్

సీ. సకల లోకముల కీ • శ్వరుఁడయ్యు నెడపని,
విషమదృష్టియటన్న • వినికియొకటి
విశ్వసంరక్షణా • న్వితయశుండయ్యుఁ గు,
త్తుక విసంబూనునన్ • దూఱొకండు
సముధికైశ్వర్య ని • శ్చలుఁడయ్యు మానక,
బికిర మెత్తునటన్న • వికలతొకటి
మహితాగమస్తూయ • మానుఁడయ్యును బ్రహ్మ
హత్య చేసెనటన్న • యూడియొకటి

గీ. దీర్చికొనఁ గోరి నిజముగఁ • ద్రిపురవైరి
యవతరించె మంత్రిప్రెగ • డాన్వయమునఁ

జారు సమదృష్టి మధురవా • గ్భూరి విభవ
ఘన సుగుణయుక్తి మల్లికా • గ్జనుడనంగ॥ 30

చ. ఆతనికి నగ్గిరీంద్రతన • యం బురణించు గుణంబు లొప్పగా
నతుల హితప్రచారయగు • నర్ధశరీరిణి యై సమంచిత
స్థిత నలరించె సంతతి వి • ధేయత నంచిత నర్మవాగ్విశా
లత్వదగ సీతమా విజయ • లక్ష్మి సమాఖ్య సమాఖ్యరాజిలన్.

సీ. సర్వమంగళ యేయ • చండిక విభుని ని,
రూఢి నరంగపొ • రుషుని జేసె
నిందిరాసుందరి • యెట్టి నిశ్చలభావ,
ద్రిమ్మరిగా ధరణి • బొమ్మ దొక్క
వాణి యేసఖ్య స్వ • భావ జలాగ్రయై,
పతి నోటనాగియు • ధతిని మోగె
గంగ దా నెట్టి య • కల్మష చరిత యు,
ద్వాతిగా నాథుని • నెత్తి కెక్క

గీ. ననుచు జనులు ముమ్మూర్తుల • యాండ్ర దెగడి
తనదు పతిభక్తి వేనోళ్ళ • దనరి పొగడ
నలరు మంత్రి పెగడ మల్ల • కొగ్జినాఖ్య
రాణి సీతావిజయలక్ష్మి • రమణి మిన్న॥ 32

ఉ. ఆ లలనాశిరోధర • వం డ జగన్నుతకీర్తి వైభవ
శ్రీ లలితుం డతండు కుల • సింధు సుధాకరునిన్ భుజంగరా
ణ్మౌళిని గాంచె బుత్రుని స • మంచితమై తగు విద్యయందు బ్ర
జ్ఞా లసితుండు మక్కువ బె • నంగి ప్రబోధము గాంచు పోలికన్.

సీ. నిండిన తనకీర్తి • పుండరీకమునకు
గగన మంచిత మగు • కరము గాగ
బటులె రాత్మ ప్రతా • ప ప్రదీప జ్యోతి,

కెల్ల జగం బొక్క ♦ యిల్లుగాఁగఁ
బరిచితాత్మీయ వి ♦ తరణ లక్ష్మికిఁ గల్ప,
కుజపంచకము కరాం ♦ గుళులు గాఁగ
మేలైన తన ప్రజా ♦ పాలన ప్రౌఢిమ,
యవనీజనులకు ప ♦ ్రాంగి గాఁగ

గీ. వెలసె విలసిత గుణరత్న ♦ నిలయుఁ డతుల
పుణ్య మంత్రి ప్రెగడసులాం ♦ భోధి విధుఁడు
రాజబిరుదాఢ్యుఁడు భుజంగ ♦ రావు బహ
దరు జమీందారు బలు సర ♦ దారుఁడగుచు ‖ 34

సీ. కువలయంబెల్ల ను ♦ త్సవమున రేకెత్తె,
సన్మార్గ సంచార ♦ సరణిహత్తె
విబుధులన్న సమృద్ధి ♦ విలసిల్లి దీపింప,
విమల సువృత్త భా ♦ వము వహింపఁ
గనుఁ గొను వారల ♦ కనులు చల్లఁగనుండ,
మెండుగా సత్కళల్ ♦ నిండియుండ
సహజ లక్ష్మికతఁ ♦ జనులెల్లఁ గొనియాడ,
సత్ప్రభుం డితఁడంచు ♦ జగమువాడ

గీ. కలిత రాజాభిధానుఁడై ♦ యలఘు కీర్తి
చంద్రికల నెల్ల దిక్కుల ♦ సాంద్రముగ నె
సంగఁగాఁ జేసె నార భు ♦ జంగరాయఁ
డితఁడు సర్వజ్ఞ శేఖరుం ♦ డేతలంప ‖ 35

మ. కృతకృత్యత్వము గాంచి యూతనిమహ ♦ త్కీర్తి ప్రతాపంబు ల
ద్భుత లీలం జని చక్రవాళ మహిభృ ♦ త్కూటోప రక్షోణి నం
థ తమో వ్యాప్తులడంచి మించి వెలుగొం ♦ దం జంద్రసూర్యుల్విధా
స్థితులంచుం బరివేష దంభమున నుం ♦ చెన్ ధాత బల్కుండలిన్ ‖

మ. పటుఘాటీ పరిపాటి నూటిఁగొనఁగా ♦ బాహ్లీక ఘోటీ వితం
కట రంహస్స్ఫుట వల్గితప్లుత ముఖా ♦ కారోరు ధారా రసో
త్కటతం జూపిన గోటలుం గురుజులున్ ♦ గాటంబులౌ పేటలుం
ద్రుటిలోఁ దాటి చను న్నిరంతర మహో♦ రుక్షిప్రతం జూపుచున్॥

ఉ. వారువమెక్కి కేల నొగి ♦ వాగె వహించినఁ జాలు గాడ్పుతోఁ
దారసిలంగ బందెమిడి ♦ త్రాణమెయిన్ గెలువంగ నేర్చు వే
మారును నట్టిరౌతు మగ ♦ మానిక మెంచను లేఁడటంచుఁ గై
వారము సేయుచుండ్రు సరి ♦ వారన జాలు ధరాతలేశ్వరుల్॥

సీ. చక్రా నురంజన ♦ సౌమ్యుఁడై తగురాజు
కువలయామోదంబుఁ ♦ గూర్చు నినుఁడు
గోత్రపక్షస్ఫూర్తిఁ ♦ గొఱలఁజేయు మహేంద్రుఁ,
డింపు పల్కులతోడ ♦ నిచ్చు ఘనుఁడు
పుణ్య జనులఁ బ్రోచు ♦ పురుషోత్తముఁడు పురం,
బుల నెల్ల నభివృద్ధి ♦ నిలుపు నీశుఁ
డలఘు జాడ్య విహీనుఁ ♦ డగు మహీభృద్వరుం,
డక్రమ స్థితి గాని ♦ చక్రవర్తి

గీ. యనఁగ బొగడొంది సకల ది ♦ శాగ్ర రంగ
విసృమర యశః ప్రసూనుఁడై ♦ వెలయుచుండు
రాజ బిరుదాంకితుఁడు సర్వ ♦ రాట్సమాజ
మాన్యగుణశాలి భుజగరా ♦ జన్యమౌళి॥ 39

గీ. మహిత కస్తూరివంశాగ ♦ మమునఁ బుట్టి
దిట్టయై తగు జతురాస్య ♦ చెట్టఁబట్టి
వెలయుఁ జిన్నమ్మరావు వి ♦ ద్యలకు రావు
అతని పట్టపురాణి ప్ర ♦ త్యక్షవాణి॥ 40

సీ. తన మనంబునఁగల్గు ♦ ననఘువర్తన మెల్ల
  జెలిపైన వదన మం ♦ డలమె తెలుపఁ
దన దుసద్గుణముల ♦ నెనయు సౌశీల్యంబుఁ,
  దెలికన్ను గొనచూపు ♦ కలిమి తెలుపఁ
దన యకౌటిల్యవ ♦ర్తన నిదానంబెల్లఁ,
  గడుతీయనగు పల్కు ♦ బడియె తెలుపఁ
దన పుణ్యభావ శాంత ♦ స్వ భావంబుల,
  సరణి నాకార సౌ ♦ ష్టవమె తెలుపఁ

గీ. గ్రమ్మునట్టి పొగడ్తల ♦ కిమ్ము పుడమిఁ
గలుగు కరితల తలమాని ♦ కమ్మ యాచ
క ప్రతానమునకుఁ గల్ప ♦ కమ్మనంగ
నలరుఁ బతిభక్తిఁ బోవు చి ♦ న్నమ్మరావు॥ 41

క. అతులగతి నలరు నీదం
పతుల పురాచరిత సుకృత ♦ పరిపాక ఫల
స్థితి నొక్క ముద్దుకొమరుఁడు
చతురాకృతి పంచశరుఁడు, ♦ జనితుండయ్యెన్॥ 42

సీ. ప్రత్యూష వికసితా ♦ బ్జాత పత్రోపమ,
  విమల విశాలనే ♦ త్రములవాఁడు
తళుకొందు నట్టి ని ♦ ద్దా మేలి సొన్నా క,
  డాని డాల్మెఱయుమే ♦ మ్మేనివాఁడు
కమనీయ పల్లవ ♦ గర్భిత మందార,
  లతికా తులిత బాహు ♦ లతలవాఁడు
నిండు పున్నమ నాటి ♦ పండువెన్నెల చంద,
  మాము నవ్వెడు ముద్దు ♦ మోమువాఁడు

గీ. చెలువుగలవాఁడు ముద్దులు • గులుకువాఁడు
చిలుకపలుకులవాఁడు మె • ప్పొలుకువాఁడు
భవ్య దుర్గా సమన్విత • పద్మనాభ
మల్లిఖార్జునరాయఁడు • మహితగుణుఁడు॥

## షష్ఠ్యంతములు

క. ఏవంవిధ సుగుణ గణ
శ్రీ వినుతున కఖిల విబుధ • చింతామణికిన్
భావిత సమధిక విభవ శు
భావహ ధోరణికిఁ గల్ప • భాగ్యతరణికిన్ 44

క. ధీరునకుం గవిజనమం
దారునకు న్విమత గిరిశ • తారునకున్ బృం
దారక విభు భోగ మహో
దారునకున్ భూరిదాతృ • తా శూరునకున్॥ 45

క. రాజా బహాదరు బిరుద వి
రాజితునకు సంతతాప • రాజిత విద్యా
భోజునకు నధిక విభవ బి
డౌజునకున్ మంత్రిప్రెగ్గ • డాన్వయజునకున్ 46

క. ఉల్లసిత లక్ష్మావరయుత
వెల్ల పరగణా జమీను • విశ్రుత రాజ్య
ప్రోల్లసిత పాలనైక స
ముల్లాస సమన్వితునకు • నురుతేజునకున్ 47

క. అష్టావధాన కవితా
నిష్ఠునకు సమస్త సుకవి • నికర నుత గుణో
త్కృష్టునకు మహిత కీర్తి గ
రిష్ఠునకున్విబుధ నృప వ • రిష్ఠునకుఁ దగన్॥ 48

క. రంగన్నిజకీర్తిజా విభా
సంగత హరిదంతర ప్ర • సాధిత ఘృణికిన్
మంగళగుణ ధోరణికి భు
జంగ నృపాలాగ్రణికి ల • సమణమణికిన్

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నశ్వలక్షణ సారసంగ్రహమను గ్రంథంబు శాలిహోత్ర నకుల భోజరాజాది పురాతన మహానుభావులచేఁ బ్రోక్తంబులగు వివిధగ్రంథంబులఁ బరామర్శించి యాదలి సారంబు నెల్ల సంగ్రహించి నాతివిస్తరంబుగా నొనర్పఁ బూనితి నిందు నశ్వోత్పత్తియు, నావర్తలక్షణంబు, వరలక్షణంబు, దశక్షేత్రవిభాగంబు, వయఃపరిజ్ఞానంబు, చికిత్సావికల్పంబు ననునవి క్రమంబుగఁ బ్రవచితంబులయ్యెడు నెట్లనిన

## కథా ప్రా రం భ ము.

చ. విమత జిగీష వాసవుఁడు • వేఁడిన నబ్జజుఁ డాత్మతేజ మం
ద మృతము నగ్నియుం గలిపి • యశ్వము జేసి తదీయ దేహమం
దమరస దాగతిన్నిలిపె • ట్లరుటజా హరి దేవతామయుం
బమితే శుభప్రదంబు విజ • యాస్పదముజా నృపపూజ్యమై తగెజా ॥

తా. పూర్వకాలమున నింద్రుఁడు పగవారల గెలువఁగోరి తనకు యోగ్యమయిన వాహనము నిమ్మని బ్రహ్మనడుగఁగా నాబ్రహ్మ తనతేజస్సులో నొక పాలుదీసి దానిలో నమృతాంశమును నగ్నిదేవుని యంశమున గూర్చి గుఱ్ఱమునుజేసి దానిదేహమందు వాయుదేవుని నిలిపెను. అందువలన నశ్వము దేవతాస్వరూపము గావున లక్ష్మీకరంబును జయప్రదంబునునై రాజసమ్మానయోగ్యముమునది.

క. ఘోరాహవమున విజయము
గోరెడు నరపతికి బలము • గుఱ్ఱమె జును యా

శ్వారూఢుఁ డన్యసైన్య జ
యారంభమునం గృతార్థుఁ • డయ్యెడు జలకన్॥ 2

తా. చతురంగములయందు గుఱ్ఱము ముఖ్యమయినది. యుద్ధమందు జయముఁ గోరెడు రాజునకు తురంగము ముఖ్య సాధనము. హయారూఢుఁడయినరాజు పగవారిని చులకనగా గెలుచును.

క. సమధిక శుభలక్షణముల
నమరెడు హయమెవని యింట • నలరెడు నాయు
త్తముని గృహసీమ ముదమున
గమలాలయ కదలకెపుడు • కాపురముండున్॥ 3

తా. ఉత్తమ లక్షణములుగల గుఱ్ఱమెవని యింటనుండునో వానియింట నెల్లకాలమును లక్ష్మీదేవి సంతోషయుక్తురాలై స్థిరముగ నివసించును.

క. అరయంగ దోషయుతమగు
తురగం బెవ్వాని యింట • దోఁచునొ యచటన్
నిరతము నకారణంబుగ
బరిపరి రీతులు దొసంగు • బాటిలుచుండున్ 4

తా. చెడులక్షణముల గుఱ్ఱ మెవ్వని యింట నుండునో వానియింట కారణములేని యాపదలు గలుగుచుండును.

క. రత్నమ్ములకును వనితా
రత్నమ్ములకును దురంగ • రత్నమ్ములకున్
నూత్న శుభలక్షణములు ప్ర
యత్నమ్మునఁ జూడవలయు • నందురు పెద్దల్ ॥ 5

తా. రత్నములకును స్త్రీలకును గుఱ్ఱములకును లక్షణములు పరీక్షించవలెనని పెద్దల యభిప్రాయము.

వ. కాబట్టి

క. తురగముల లక్షణంబులు
పరగుణులైనట్టి విబుధ • వర్యుల మతముల్
బరికించి మేలుకీడుల
తెరవులు విభజించి యిందుఁ • దెలుపబడియెడున్ ॥ 6

తా. పూర్వకాలపువారగు శాలిహోత్రాదుల మతములెల్ల బరిశీలించి మేలులక్షణములు కీడులక్షణములు విభజించిన యశ్వలక్షణము లెల్ల నిందుఁ జెప్పబడుచున్నవి.

క. అరయ శుభాశుభములకుఁ
గారణములుగాఁగ సుడులు • గలుగు హయలకున్
వారికి నావర్తవిధం
బారూఢార్థముగఁ దెలుప • నయ్యెడు మొదలన్ ॥ 7

తా. గుఱ్ఱముల మేనులయందు మేలుకీడులకు హేతువులై కొన్ని సుడులు పొడముచున్నవి. కావున మొదటనట్టి సుడుల తెరంగెల్ల దెలుపఁబడుచున్నది.

చ. సుడిముకుళంబు పాదుకయు • శుక్తిసమూహము పాదుకార్ధముం
బడి నవలీఢకంబు శతపాది యనంబడు నామధేయముల్
బడసి విభేదరూపములు • బాటిలనెన్మిదిభంగులందు త
త్తడులశరీరభాగములఁ • దార్కొను సుల్లుబరీక్ష సేయగన్ ॥

తా. గుఱ్ఱముల దేహములయందు పుట్టెడుసుడులు వాటియాకారభేదములవలన నెనిమిది తెరంగులనుండి క్రమంబుగ సుడి, ముకుళము, పాదుక, శుక్తి, సమూహము, పాదుకార్ధము, అవలీఢము, శత పాదియని యెనిమిదిపేళ్ళచే పిలువఁబడుచుండును.

౨. వీటి స్వరూపప్రమాణంబు వివరించెద.

క. కుడివైపు బ్రదక్షిణముగ
సుడియుదక భ్రమణమునకు • జోడై యుండున్

నిడుపుగ వెడలుపు సమమై
ర్పడఁ దగునది యంగుళత్రి ♦ భాగమునందుఁ॥ 9

తా. సుడి, దీనిపేరే ఆవర్తము, ఇది నీటిలోని సుడివలె కుడివైపునకు ప్రదక్షిణముగా దిరిగి పొడవు వెడల్పు సమమై యొకయంగుళములో మూడవపాలు ప్రమాణము గలిగియుండును.

క. ముకుళంబు నిలుచు మల్లీ
ముకుళమువలె రోమచయము ♦ మొనలం గదియం
బ్రకటితమగు పరిమాణం
బొక పాతిక యంగుళమున ♦ నొప్పగు చుండుఁ॥ 10

తా. ముకుళమనునది రోమముల మొన లొండొంటితో గలసి మల్లెమొగ్గ నంటి యాకారముతో పాతికయంగుళము ప్రమాణము గలిగ యుండును.

క. పాదుక యను నావర్తము
పాదుకవలె నుండు రోమ ♦ పఙ్క్తులు దిరుగం
బ్రోదిగఁ జతురంగుళ మా
త్రాదిష్టంగుళ ప్రమాణ ♦ మై విలసిల్లుఁ॥ 11

తా. పాదుకయనునది పాదుకవంటియాకారముగలిగి రోమములుదిరుగబడి నాలుగంగుళములు ప్రమాణము గలిగియుండును.

క. ముత్తెపుచిప్ప తెరంగున
హత్తుకొనుఁ శుక్తి భ్రమణ ♦ మధికం బగుచుఁ
వృత్తము రెండంగుళముల
నుత్తమ శాస్త్రప్రమాణ ♦ యుతమై వెలయున్॥ 12

తా. శుక్తియనుసుడి ముత్తెపుచిప్పవలె చుట్టుదిరిగి రెండంగుళములు ప్రమాణము గలిగి యుండును.

క. రోమములు కొనలు గదియం
గా మూగిసమూహ మగుచు ♦ గ్రాలు సమూహం
బౌ మేర బ్రమాణము ఘన
మై మఱి గొలుచు నెడ నెనిమి ♦ దంగుళములగున్ ॥ 13

తా. సమూహమనునది రోమములు నిక్కపొడుచుకొని గుంపై యొని
మిది యంగుళములు ప్రమాణము గలిగి యుండును.

క. తునిసిన పాదుకతో జో
డనఁ దగు నాకృతినిఁ బాదు ♦ కార్ధము వెలయుం
గన ముప్పాతిక యంగుళ
మునఁ బరిమితమందు శాస్త్ర ♦ మున కథితమగున్ ॥

తా. పాదుకార్ధమనునది తునిగిపోయిన పాదుకయొక్క ముక్కవంటి
యాకారముతో ముప్పాతిక యంగుళము పరిమాణము గలిగి
యుండును.

క. చేకొని రోమములు దిరిగి
నాకిన గతి వంగి గన్గొ ♦ నగ నవలీఢా
ఖ్యా కలిత మగుచు నాకృతి
నైకొను మూడంగుళములు ♦ పరిమాణమునన్ ॥ 15

తా. అవలీఢమనునది మూడవాలుకతో నాకినట్లు రోమ మొక్క
ప్రక్కకు వంగి మూడంగుళములు పరిమాణము గలిగియుండును.

క. వితతముగఁ జెట్టి ప్రాకిన
జతనంబున నల్లసిల్లు ♦ శతపాది యనన్
శ్రుతిమగు నావర్తం బది
చతురంగుళ పరిమితమున ♦ సమకొని యుండున్ ॥ 16

తా. శతపాది యనునది జెట్టిప్రాకినట్లు పొడవుగా నాలుగంగుళములు
ప్రమాణము గలిగియుండును.

క. పాదమెదు నీయెనిమిదియును
సుడిభేదము, లిందు, సుడియు ♦ శుక్తియు ముకుళం
బిదు శుభము గొదువ యేనును
చెడుగుం గలిగించు వాజిఁ ♦ జేకొను పతికిన్ 17

తా. ఈయెనిమిదియు సుడిభేదములు వీటిలో ఆవర్తము, ముకుళము, శుక్తియను మూడును శుభకరములు, మిగిలిన పాదుక పాదుకార్ధము, నవలీఢము సమూహము, శతపాదియును నైదును కీడు గలిగించును.

క. ఆవర్తంబులు చెప్పెడు
చోవడి ముకుళంబు సుడియును ♦ శుక్తియు నొకటై
గావించు శుభము ♦ తక్కిన
వేవియు శుభదములు గావ ♦ వెచ్చట నున్నన్ ॥ 18

తా. సుడియుండవలెనని చెప్పినచోట సుడిగాని ముకుళముగాని శుక్తిగాని యుండినయెడల శుభప్రదము. తక్కిన ఐదింటిలో నెద్దియేని యుండినయెడల కీడు కలుగఁజేయును.

ఉ. మేలు సుడుల్వసించు నెడ ♦ మీదటి పాదుక దొంటి యేనునం
గ్రాలెడి నేని మేలు చెడుఁ, ♦ గాని సుడుల్నెలకొన్న తావులం
బోల వసించి కీడు పరి ♦ పూర్తిగ నిచ్చును కీడుసుళ్ళలోఁ
వోలి శుభప్రదంపు సుడు ♦ లుండిన గీడుఁ దొలంగ జేసెదున్ ॥

తా. మేలుసుళ్ళుండవలసిన తావులలో పాదుక మొదలగు కీడు సుళ్ళయిదింటిలో నెద్దియేనియుండెనేని మేలుచేయదు. కీడుసుళ్ళుండవలసిన తావులలో నీయేనింటిలో నొకటియుండెనేని యధికమగు కీడు చేయును. అట్టిచోటనే సుడిగాని ముకుళముగాని శుక్తిగాని యుండెడునేని కీడు తొలఁగిపోవును. ఫలితార్థము, సుడి ముకుళము శుక్తి యివి మంచిసుళ్ళుండవలసిన తావులనుండి యధికశుభము చేయును, కీడుసుళ్ళుండవలసిన తావులనుండెనేని కీడుచేయవు.

పాదుకాదులగు నయిదును మేలుసుళ్ళుండవలసిన తావులనుండి మేలుచేయవు. కీడుసుళ్ళతావులలో నుండి యధికముగఁ గీడు చేయును.

క. ఎడమకుఁ బ్రదక్షిణించిన
నడిమికిఁ దెగి రెండుగాఁ గ ♦ నంబడినను నా
సుడులు కొఱగావు కర్తకుఁ
గడుఁగీడొనరించు ననిరి ♦ ఘన శాస్త్రజ్ఞుల్॥ 20

తా. సుడులు ఎడమకుఁ బ్రదక్షిణముతిరిగినట్లున్నను నడిమికిఁదెగి రెండుగానుండినట్లగనఁబడినను నట్టిసుళ్ళుగల గుఱ్ఱమును గట్టినవాని కనశ్యమును గీడొనరించునని పెద్దలు సెప్పుచున్నారు.

వ. ఇది యావర్త సామాన్యలక్షణంబింక.

క. ద్వివిధములగు నామంబుల
ధ్రువములు నాగంతుకములు ♦ తురగము మేనం
దవిలిన సుడులన్నియు వా
ని విధంబులు తెల్లముగఁ బ్ర ♦ ణీతమ్ములగున్॥ 21

తా. అశ్వముల దేహములను బుట్టెడు సుడులు, ధ్రువములనియు నాగంతుకములనియు రెండు తెరంగులఁ జెప్పఁబడును.

క. ఇఁక ధ్రువములు పది యాగం
తుకములు నూటపదమూఁడు ♦ దోఁచును హరియం
గకములను ధ్రువావర్త
ప్రకారమంతయును దెలుపఁ ♦ బడియెడు మొదటన్॥ 22

తా. అశ్వములమేనియందు ధ్రువములు పదియును, అగంతుకములు నూటపదమూఁడును మొత్తము నూటయిరువదిమూఁడు సుడులు పొడముచున్నవి. ఇందుమొదట ధ్రువవార్తములతెరఁగు చెప్పఁబడుచున్నది.

చ. శిరమున రెండు వక్షమున ♦ రెండును రెం డిరుప్రక్కలందు రెం
డిరవగు రొండ్ల రెం డొకటి ♦ యేర్పడు పై పెదవిన్ ముఖంబునం
దిరమగు నొక్క టీకరణి ♦ తేజికి మేన ధ్రువంబులై పదిన్
బరగుచునుండు తానములు ♦ బాయక సుళ్ళు శుభప్రదంబులై ॥

తా. అశ్వమునకు తలమీద రెండు వయిఫుల రెండును రొమ్మున రెండు వయిఫ్రుల రెండు. నాభివద్ద పొట్ట ప్రక్కల రెండువయిఫ్రులను రెండు. మీది పెదవిమీద నొకటి నొసట మధ్యభాగమందొకట యీప్రకారము పదిస్థలములయందు పదిసుడులు తప్పకుండ నుండును. తప్పకుండనుండునవి గనుకనే ధ్రువములని చెప్పబడుచున్నవి. ఈచెప్పిన పదిధ్రువములును వాట నిదిష్టస్థానములు తొలంగక నుండెనేని శుభప్రదము.

క. శిరమున నుండెడు ధ్రువముల
కరయంగా మస్తకమ్ము ♦ లని పేరొప్పన్
సరిగా నుండఁగవలె నెటు
జరిగి యెగుడు దిగుడుగాఁగఁ ♦ జన దించుకయున్ ॥ 24

తా. శిరస్సుమీదిధ్రువములకు మస్తకములని పేరు ఇవి యొకటికొకట సరిగానుండవలెను గాని గాటునిటుజరిగి యించుకంతయు నెగుడు దిగుడుగా నుండరాదు.

క. మస్తకము లెగుడు దిగుడై
కస్తిం గలిగించు నెపుడు ♦ కలహము మరి య
మ్మస్తకములు లేకుండిన
నిస్తుల దుఃఖదము జూడ ♦ నే రాదు హరిన్ ॥ 25

తా. మస్తకము లెగుడుదిగుడుగానుండెనేని కలహముగీడుగలుగఁజేయును మస్తకములు లేకపోయినయెడల నాగుఱ్ఱమును కంటజూడనేరాదు

ఆ. ఎడమ నొకటి లేక ♦ నిల్లాలిఁ జంపును
కుడిని నొకటిలేక ♦ కొడుకుజంపు

హీనమస్తకముల ♦ కీలాగు ఫలమందు
రట్టి చెనటి వాజి ♦ ముట్టఁ జనదు॥ 26

తా. ఎడమ వయిపున మస్తకములేనియెడల నిల్లాలికిని కుడివయిపు మస్తకము లేకుండిన కొడుకునకును ప్రాణహాని గలిగించును గావున నిట్టి గుఱ్ఱము నుంచరాదు.

క. స్థానములు దప్పి ధ్రువములు
గానంబడెనేనిఁ గీడుఁ ♦ గలిగించును వెం
డైనను దక్కువయైనను
మానక నత్తేజి పతికి ♦ మరణము సేయున్ ॥ 27

తా, ఈధ్రువములు స్థానములు దప్పి కనుపడెనేని కీడుచేయును. ఆయా స్థానముల యందుండవలసిన వానికంటె నెక్కువయున్నను దక్కువయయి యున్నను కర్తకు ప్రాణహాని గలిగించును॥

క, ఆవర్త శుక్తి ముకుళము
లేవైనను ధ్రువల నిలిచి ♦ యెలిమి యొనర్చుం
గావించు పాదుకాదులు
దావలమై కర్తకధిక ♦ దైన్య ఫలంబుల్ ॥ 28

తా. ధ్రువములుండవలసిన చోట్ల ఆవర్త, శుక్తి, ముకుళము, వీటిలో నేదేనియుండిన మేలుసేయును. ఆచోట్ల పాదుకాదు లయిదింటిలో నొక్కటి యుండెనేని కర్తకు దుఃఖములు గావించును.

క. సుడి యొక్కటేని మేనం
బొడసూపక యుండెనేని ♦ మూఢక మనఁగాఁ
బడు నాతత్తడి ఘతకుఁ
గడు దుఃఖము సేయు ముట్టఁ ♦ గా రాదెపుడున్ ॥ 29

తా, గుఱ్ఱము మేన సుడులే లేకున్న యెడల దానిపేరు మూఢకము. అది యధిపతికి మిక్కిలి కీడు గలిగించును గాన నట్టి దానిని ముట్ట రాదు.

క. ఇంటం బుట్టిన నేనియు
నొంటం దశగ్రహవులఁ బూన ♦ కుండిన వాజిన్
గంటం జూడఁగఁ గూడదు
గెంటించఁగ వలయు నూతి ♦ కెలకులు దాటన్॥ 30

తా. కీడు సుళ్ళయినను యింటఁబుట్టిన గుఱ్ఱమునకు దోషము లేదని చెప్పదురుగాని యింట బుట్టిన గుఱ్ఱమయిననుసరే దశగ్రహములు లేకున్నయెడల నట్టి దానిఁ గనుల జూడరాదు గాన నూరుదాఁటు నటుల గెంటించుట యుత్తమము

క. ఉండి దశగ్రహము లాపై
నొండొక సుడి మేనఁ గలుగ ♦ కుండిన హయ మొ
క్కండదు ఫణిజాతి యనఁబడు
నిండుగ నధిపతికి శుభము ♦ నెల కొల్పు నొగిన్ 31

తా. దశగ్రహములును యథాస్థానములందుండి యంతకంటె నధికముగ నొక సుడియును లేకుండిన గుఱ్ఱము నాగజాతి గుఱ్ఱమనఁబడును అది యధిపతికి సంపూర్ణమయిన మేలు గలిగించును.

క. పాటిలు నాగంతుకములు
నూటం బదుమూటి లోన ♦ నుఱ ముప్పది యో
డాటంకము లేని శుభో
త్పాటితములు కొదువ డెబ్బ ♦ దాఱు నశుభముల్॥ 32

తా. ఆగంతుకావర్తములు నూటపద మూడింటిలోను ముప్పదేడు శుభములు డెబ్బదియాఱు అశుభములు నగును.

క. మేలు సుడులు ముప్పదియే
డోలిం దత్తత్ప్రదేశ ♦ యోజితములు గా
గిలుకొను భద్ర లక్షణ
జాలం బిల వింశతి ప్ర ♦ చారంబులగున్॥ 33

జెక్కిన వాడు ముజ్జగము ♦ లేలఁగఁ జాలు రణాంగణంబునన్
ద్రుక్కఁగఁ జేయు శత్రుల యశోవిభవోజ్వలుఁడై తనర్చెడున్॥

తా. గుఱ్ఱము నుదిటిమీఁద మూడుకోణములుదీటి పొక్కిడిగడ్డలవలెమూ
* డుసుళ్ళుండినట్లాయెనా దానిపేరు త్రేతాగ్ని. అట్టిగుఱ్ఱమును నె
* క్కినవాఁడు ముల్లోకములు నేలగల ప్రభావసంపన్నుఁడయి యు
ద్ధములో శత్రుల నోడించి కీర్తియు, నైశ్వర్యమును పొందును.

3. నిశ్రేణి.

ఉ. బంతిగ మూఁడు సుళ్లొకటి ♦ పై మఱియొక్కటిగా మొగంబునన్
వింతగ దోఁచు నాసుడులు ♦ నిచ్చెన సుళ్లన నొప్పు గుఱ్ఱమే
చెంతల నుండు నాపతికి ♦ జేరు సమస్త రమావిలాసముల్
సంతత కీర్తి నైసెను ♦ శత్రు జయంబు ధరాపతిత్వమున్॥

తా. *గుఱ్ఱమునుదట నొకటిమీద నొకటి బంతిగా మూడుసుళ్ళుండు
*నేని దానిపేరు నిశ్రేణి. ఈలక్షణమున్న గుఱ్ఱము నెక్కువాడు
*సకలైశ్వర్యములను సత్కీర్తియు శత్రుజయముగలిగిరాజగును.

4. తోరణావర్తనము.

ఉ. అరయ ఫాలరాగమున ♦ నడ్డము మూఁడు సుడుల్ ఘటిల్లినన్
దోరణ నామధేయమున ♦ దూకొను మంగళ రత్నణంబగున్
వారువ మద్ది వల్లభు న ♦ వారణ సంచిత భోగభాగ్య ల
లక్ష్మి రమణీయు జేయునని ♦ చెప్పిరి శాస్త్రకళావిశారదుల్॥

తా. నొసటి మీద నడ్డముగా మూడు సుళ్ళుండె నేని తోరణావర్తమన
బడును. ఇట్టి లక్షణము భర్త నపరిమిత భోగభాగ్యసంపన్ను
జేయును.

5. యామళావర్తము.

చ. అగయగ రెండు సుళ్లు జత ♦ యై పైకెనియు బక్కకేనియున్
దరగము ఫాలదేశమున ♦ దోఁచినచో యమళాభిధేయ మా

నిరవ్రగ నట్టి సైంధవము ♦ నెక్కిన వాడు సమస్తమేదినీ
శ్వరుఁడగు నొండె నచ్యుతపు ♦ సంపద లొందెడు నొండె ధా
రుణిన్ ‖ 38

తా. అశ్వము నొసట రెండు సుళ్లు జవరై పయికిగాని ప్రక్కకుగాని
* తిరిగియుండెనేని దాని పేరు యమళావర్తము. అట్టిగుర్ర మెక్కిన
* వాడు రాజైనను లేనిచో నెడలేని సంపదలయిన ననుభవించును.

## 6. సృక్వణావర్తము.

చ. చెలివెల రెండుపక్కియల ♦ జెందగ రెండుసుడుల్ ఘటిల్లినన్
జెలగుచు నుండు వాజులకు ♦ సృక్వణ లక్షణ నామధేయమై
యలఘు శుభ ప్రచారమగు ♦ నట్టి తురంగము నేలువానికిన్
గలుగు నఖండ వైభవ ని ♦ కాయములుం గొరలేక నెప్పుడున్

తా. చెలివెలమీద రెండుపయిపులను రెండు సుళ్లుండినయెడల నది
సృక్వణావర్తలక్షణమని చెప్పబడును. అట్టిగుర్రము నెక్కెడు
వానికి నెడతెగని సంపదలు గలిగియుండును.

## 7. స్తువావర్తము.

ఉ. ఫాల శిరస్థలంబులను ♦ పాటిగ మధ్యమునన్ స్తువంబనం
గ్రాలెడు నట్టి చోట సుడి ♦ గ్గ స్తువాంక సనాధమైతగున్.
మేలొనరించు నిట్టి సుడి ♦ మేకొను వాజి సమస్తమేదినీ
పాల లలామ జేయు నిజ ♦ భర్త నటంచురు శాస్త్రకోవిదుల్ ‖

తా. ఫాలతలంబునకు శిరస్సునకు మధ్యభాగము స్తువమని చెప్పబడును.
ఆస్తువముమీద సుడియుండెనేని స్తువావర్తమనంబడును. అట్టి
స్తువావర్తముగలగుర్రము తనభర్తను భూపాలునిజేయునని యశ్వ
శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

8. కాకపక్షావర్తము

ఉ. ముందట కూకటిం గదసి ♦ ముచ్చటయై సుడి గల్గియుండెనే
నందపు కాక పక్షమని ♦ యందుఱు తాదృశ సైంధవోత్తమం
బెందు వసించు నచ్చట ♦ సమిద్ధ సమిజ్జము భోగభాగ్యముల్
గ్రందుగ నుండునెల్లపుడు♦గర్తను వాంఛితపూర్తి సేయుచున్ 41

తా. మొగముమీద వ్రేలుచుండు కుచ్చువంటి వెండ్రుకలు కాకపక్షము అనగా జుంచువని చెప్పఁబడును. ఆచుంచుక్రింద సుడియుండెనేని యది కాక పాక్షావర్తము ఇదిగల తురంగ మెచ్చటనుండిన నచ్చట సకలైశ్వర్యములును కొదువలేక యుండును.

9. నిగాళావర్తము.

మ. హను కంఠాంతర భాగ మొప్పగు నిగా♦శాఖ్యమై యందుపై
ననఘుం డౌ సుడిగల్గెనేని నిగా శాఖావర్తాఖ్య విఖ్యాతమౌఁ
గననే తాదృశ లక్షణాన్విత తురం ♦ గంబుండు నేమందిరాం
గణ మందచ్చట నుండు నిందిర సదా ♦ కళ్యాణ సంధాత్రియై

తా. హనువులనఁగా వెలుపటిదవడలు. ఆట్టిహనువులకు కంఠమునకు మధ్యభాగము నిగాళమనఁబడును. అచ్చటనున్న సుడిపేరు నిగాళావర్తము. ఈ సుడిగల గుఱ్ఱమున్నచోట లక్ష్మీదేవి యెల్లకాలమును నివసించి సకలకళ్యాణము లిచ్చును. నిగాళంతు గళోద్దేశే అనుటచే గళమునకు సమీపభాగము నిగాళమనఁబడును.

10 వృషభావర్తనము.

మ. పరికింపం జెవి గూబ చక్కటులపై ♦ భాసిల్లు నావర్తముల్
వరుసన్ రెండు గెలంకులందు వృషభా ♦ వర్తాభిధానంబు లౌ
తురగం బిట్టిది కర్త కిచ్చును మణి ♦ స్థూలాంశు మత్కుండల
స్ఫురణా ఖ్యారి పరిష్క్రియా విభవ ని ♦ స్ఫూర్తుల్లను ల్మెచ్చగన్

తా. రెండు చెవులగూబలయొద్ద రెండుసుళ్ళుండెనేని వృషభావర్త ములనఁబడును. ఇవిగలగుఱ్ఱము మణిమండలాది సంపదలు ఘటి యించును.

## 11. కంఠాభరణము.

ఉ. ప్రాభవ మొప్పఁ గంఠమున • బైకొని మధ్యగ నొక్కటేనియున్
శోభిల రెండు ప్రక్కలను • జోడుగ రెండుసుటిల్లెనేని కం
ఠాభరణాభిధేయమగు • నట్టి సుడుల్ గల వాహ ముల్లస
ద్భూభరణ ప్రభావ పరి • పూజ్యత నిచ్చును భర్త కెంతయున్.

తా. కంఠమున మధ్యకొలొక్కసుడిగాని లేక రెండుప్రక్కల రెండు సుడులుగాని యున్నయెడల నది కంఠాభరణమని చెప్పఁబడును. ఇట్టి లక్షణములుగలగుఱ్ఱము అధిపతికి రాజ్యలాభముసేయును. దీనిపైనసుడియున్న యెడల నది కళావర్తమను దోషపుసుడి యగుచున్నది.

## 12 దేవమణి.

మ. తగ కంఠాభరణ ప్రదేశమున క్రిం • దఁగ గంఠ భాగాదిగా
బొగడందం జతురంగుళాంతరమునం • బొల్పారు నావర్త మిం
పుగను న్దేవమణిత్వ నామయుతమై • భూయిష్ఠ సామ్రాజ్య పూ
జ్య గరిష్ఠాత్ముని జేయు నండ్రు పతి న • శ్వజ్ఞాన పారాయణుల్.

తా. కంఠాభరణమనుసుడికి దిగువ ననగా కంఠము మొదలు నాలుగం గుళముల పరిమితాంతములో సుడియుండెనేని యది దేవమణి యందురు. ఇట్టి లక్షణముగల తురంగము భర్త నపరిమిత సా మ్రాజ్యయుక్తునిగావించును.

## 13 రోచమానము.

చ. నలువుగ గంకముం దొడరి • నాలుగు యంగుళు లొంద క్రిందుగా
నెలకొని యుండునట్టి సుడి • నిశ్చితమై తగురోచమానమై

పొలుపుగ నిట్టిలక్షణము • బూనిన సైంధవ మెప్డు భర్తకా క
ల్యలఘుతర ప్రమోద విధ • వాతిశయంబు లొసంగునెంతయున్

తా. దేవమణికిఁగ్రింద నసగా కింకీము మొదలు నాలుగంగుళముల పర
మితికి దిగువగానుంచైను సుడి రోచమానమని చెప్పఁబడు నిదిగల
తురంగము భర్తకు నపరిమితమయిభవములు గలిగించును, ఈరోచ
మానస్థానమందు శతపాది యనుసుడి సామాన్యముగా నుండును.
ఇందటమాత్రము శతపాది శుభకరమే.

## 14 శ్రీవత్సము.

చ. ఉరమున నాల్గు మూలలుగ • నొప్పగు నాలుగు సుళ్ళుగల్గి పై
నిరవుగ రోచమానము ఘ • టల్లినచో సిరివత్స సంజ్ఞచేఁ
బరగుచు నిట్టిలక్షణము • భర్తకు నొగిం జతురంత మేదినీ
భరణ విశాల వైభవ వి • భాసితుఁ జేయు నటంద్రు పండితుల్.

తా. వక్షస్థలంబున నాలుగుమయిపులను నాలుగుసుళ్ళుండి రోచమాన
ముకూడ యథాస్థానమందుండు నేని యది శ్రీవత్సమను లక్ష
ణము భర్తకు సకలభూమండలాధిపత్యము నొసంగును.

## 15 చతురశ్రము.

ఉ. నాలుగు సుళ్ళురస్థలము • నం జతురంతము గాఁగ నిల్చి పై
బోలగ రోచమానము • బూననిచోఁ జతురశ్ర నామమై
వ్రాలెడు భద్ర లక్షణము • వాహము నేలిన వల్లభుండు తా
నేలు జతుస్సముద్రగమ • హీస్థలమంతయు నత్యుదారతన్.

తా. వక్షస్థలమందు నాలుగుమయిపుల నాలుగు సుళ్ళుండి రోచమానము
లేకుండెనేని యది చతురశ్రమనఁబడు నట్టి గుఱ్ఱము కర్తను జతు
స్సముద్ర ముద్రిత ధరామండలపతిఁ జేయును.

16 ఉరస్స్రితము.

చ. ఉరమున మూఁడుసుళ్ళు హృద ♦ యోత్తరభాగముదప్పియుప్పగా
బరగెడుచో నురస్స్రితము ♦ భాసుర లక్షణమయ్యె దీన నే
తురగము పొల్చుఁ దత్పతి వి ♦ ధూత రిపు ప్రకరంబుగాఁగ నీ
ధరణి సమస్తమేలునని ♦ తజ్జ్ఞులు పల్కు-నురశ్వవేదులై॥ 48

తా. వక్షస్థలము యొక్క నడిమిభాగము హృదయము. అట్టి హృదయము తప్పించి వక్షస్థలముమీఁద మూఁడుసుళ్ళుండెనేని యది యురస్స్రితకమను చిహ్నము. భర్తకు శత్రుజయము, రాజ్య వైభవముఁగావించును.

17 అంగదావర్తములు,

ఉ. అంగద నామ భాసురము లయ్యెడు బాహుల రెండు ప్రక్కల
న్నంగుగ రెండు సుళ్ళగు ♦ రం దురగం బది కర్త కుల్లస
న్మంగళ దాయకంబు మణి ♦ మండిత హార కిరీట కుండలో
త్తుంగ భుజాంగదాది పరి ♦ తోషము లిచ్చు నటంద్రు పండితుల్॥

తా. బాహువులమీద రెండు వయిపులను రెండు సుళ్ళుండు నేని యవి యంగదావర్తములు. అట్టి లక్షణముగలవాజి తన భర్తను కిరీటకుండలాంగదాది భూషణ భూషితునిఁజేయును.

18 కేశాంతావర్తములు.

క. జూలు చివర కేశాంతము
గ్రాలెడు నన్నెలవు రెండు ♦ గడల నిరు సుడుల్
మేలొసఁగును గేశాంతా
ఖ్యా లలితా వర్త మధిపు ♦ నవనిపుఁ జేయున్॥ 51

తా. జూలుయొక్క చివర కేశాంతమనఁబడును. అట్టి యెడల రెండు ప్రక్కల రెండు సుడులుండుట కేశాంతవర్తములు. కర్తను భూపతిఁజేయుననుట.

## 19 అంగమణులు.

ఉ. చక్కగ వంకెవన్నెలు బొ • సంగెడు ముందటిజబ్బ వెన్క నే
ప్రక్కల సుళ్ళు దోఁచినను • భాసిలు సంగమణుల్ తదంకమౌ
జక్కి నృపాల రాజ్యము ప్ర • శస్తము భర్తకు భోగ భాగ్యస
మ్యక్కలనానుషంగమగు • నంచును ఘోటక శాస్త్ర పారగుల్॥

తా. అశ్వమునకు ముందటిజబ్బలను వెన్కనుండు ప్రక్కబయల వంకె
వన్నె (రికాబు) లుండుచోట్ల రెండుచయిపుల రెండుసుళ్ళుండె
నేని యంగమణులని చెప్పఁబడును. ఇట్టి లక్షణములుగల గుఱ్ఱము
పూజార్హము. (జల్మతీ గుఱ్ఱము) ఇది కర్తకు పరిమిత భోగ
భాగ్యప్రదమని చెప్పఁబడును.

## 20 మేఖలికము.

మ. ప్రణుతంబై తగు మేఖల్యాయముచే • రంధ్రోప రంధ్రంబుల
న్గణనం జెందు ధ్రువ ప్రదేశముల ప్ర•క్కన్ రెండు సుళ్ళుండినన్
మణి మద్భూషణ మేఖలాంగధరమౌ • మాన్యాత్మునిం జేయు ల
క్షణ వంతంబగు నట్టి ఘోటకము నె • క్కం జాలుధన్యాత్ముసిన్

తా. అశ్వమునకు రంధ్రోపరంధ్రంబులనుండు గ్రైవానతర్ములకుఁ
ప్రక్కలను రెండువపులను రెండుసుళ్ళుండెనేని మేఖలికలని
చెప్పఁబడును. మేఖలాంకములుగల గుర్రము భర్తకుమణిమయాం
గద మేఖలాది సంపదల నొసంగును.

క. ఇవి శుభలక్షణములు నైం
భవ మీచిహ్నంబు లొడలఁ • దాల్చెడు నేనిన్
వివిధ మనోరథ ఫల మై
భవ సిద్ధులొసంగు నంద్రము • భర్తకు నెప్పుడున్॥ 35

తా. ఇవి యిరువదియు శుభలక్షణములివిగల తురగము భర్తకెల్లపుడుఁ
సకల కామితసిద్ధులు నభిమతవైభవము లొసంగును.

చ. హల కులిశ ధ్వజాంకుశ శ ♦ రాసన శంఖ రథాంగ వేదికా
కలశ సరోజ యూప శశి ♦ ఖండ గదా ఝష స్వస్తికాకృతుల్
గళముఖ బాహు మధ్యములఁ ♦ గన్పడి యొందు సుడుల్ ఘటిల్లక
న్నొప్పదలు తురంగ మేలికఁ బ్ర♦ భూత విభూతి సమేతుఁజేయుతన్ ॥

తా. గుఱ్ఱమునకు దశ్రువులుఁగాక వేఱొండుసుళ్ళులేక ముఖమునఁగాని మెడమీదగాని వక్షస్థలమునగాని, వజ్రాయుధము, జెండా, చక్రము యజ్ఞవేది, కలశము, పద్మము, యూపస్తంభము, చంద్రరేఖ, గద, మత్స్యము, స్వస్తికము అనగాఁ బంచకోణము ఈలాగంటి యాకారములుగా సుడులుండెనేని అట్టితురగము నేలినవాని కపరిమిత సంపదలొసంగును.

క. దేవమణి రోచమానము
తో వెలసినఁ బూర్వభాగ ♦ దోషము లడఁచుం
బోవఁగఁ జేయు న్మేఘలి
కా విప్రకృతి బశ్చిమార్ధ ♦ జా శుభ చయముల్ ॥

తా. దేవమణియు రోచమానము ననురెండు లక్షణములు గలిగియుండెనేని యట్టి గుఱ్ఱమునకు ముందటిభాగము సగము శరీరమునందుండు దోషముల నన్నింటిని పోగొట్టును. మేఘలిక యను లక్షణముండినయెడల వెనుకటిప్రక్క సగము దేహమునందలి దోషముల నన్నిఁటిని బోగొట్టును.

వ. ఇవి శుభవర్త లక్షణంబులింక నశుభావర్త లక్షణంబు వివరింపం బడియెడు.

సీ. కటి శంఖ నాసికా ♦ గండ పార్శ్వాధర,
జాను మన్యా హను ♦ స్కంధ కక్ష
వహ విధు భ్రూయుగ ♦ వాలాగ్ర శుపాతోద,
రాండ కోశోరు క ♦ ర్ణాగ్ర పిండ



దేశంబులందు రెం • డేసి ఘోణ క్రోడ,
గుద ప్రోథ సీవని • ఘోటక కుద
కాకస త్రిక నాభికా •గళ హృదయోత్త,
రోష్ఠస్థలంబుల • నొక్కటొకటి

గీ. కుష్ఠికంబుల జంఘులఁ • గూర్చలందుఁ
గళల నలుగాళ్ళ నాలేసి • గాఁ బదారు
మొగిఁ బ్రపాన స్థలంబున • మూఁడు నిట్లు
సుడులు డెబ్బదియాఱు న • శుభకరములు॥ 57

తా. కటకములు, శంఖములు, నాసికాపుటములు, గండస్థలములు పార్శ్వ
ములు, అధరోష్ఠము, జానువులు, మన్యవులు, హనువులు, స్కంధ
ములు, కక్షములు, వహములు, విటపులు, భ్రూయుగములు, లోక
మొదలు, కనుగొల్కులు, ఉదరము, అండములు కోశము, ఊరువులు,
కర్ణాగ్రములు, పిండములు, ఈ యిరువదిరెండు ప్రదేశములను రెం
డేసిగా నలువదినాలుగును, ఘోణము, క్రోడము, గుదము, ప్రోథము,
సీవని, ఘోటము, కకుదము, కాకసము, త్రికము, నాభి, గళము,హృద
యము, ఉత్తరోష్టము, ఈ పదమూఁడు స్థలంబులను పద
మూడు సుళ్ళను కుష్ఠికములు, కూర్చలు, జంఘులు, కళలు,
ఈ నాలుగు స్థలంబుల నొక్కొక్కటిగా నాలుగుకా
ళ్ళను పదాఱును ప్రపానస్థలంబునమూఁడును, ఇటెన్నివవిడెబ్బదియాఱు
సుళ్ళను మంచివికావు.

క. ఇల నీ డెబ్బది యాఱును
నలువది లక్షణములైక • నంబడు నిందుం
దొలి పదునాల్గు మహోగ్ర
స్థల దోషములండ్రు గడమ• సామాన్యంబుల్ ॥ 58

తా. ఈ చెప్పిన డెబ్బదియారుసుడులు, వాటివాటి స్థానంబులయందుండె
నేని నలువది లక్షణంబులగు నందు పదునాలుగు మహాదోషంబులును
ఇరువదియారు సామాన్య దోషంబులని చెప్పఁబడును.

ఈలక్షణంబులు వాటిస్థాననిర్ణయనామధేయములతో ఫలములు చెప్ప
బడుచున్నవి.

1. కటావర్తములు.

ఉ. మానుగ కర్ణ శంఖముల ♦ మధ్య కటంబులు వానిపై సుడుల్
బూనినవో దురంగమును ♦ బోఁగఁ దోలక నింటఁ గట్టునే
మానవుఁ డాతబుద్ధి యమ ♦ మాహిష కంఠ నిబద్ధ ఘంటికా
ధ్వానము లాలకింపఁ జను ♦ దప్పదు నిర్జరుల లడ్డు పెట్టినన్ ॥ 59

తా. చెవులకు, శంఖప్రదేశములకు మధ్యమునందలి స్థలములు కటకములని
చెప్పఁబడును. అనఁగా కణతలు ఈకణతలమీఁద రెండు పెదలను
రెండు సుళ్ళుండెనేని, అవి కటావర్తములు. ఇట్టిలక్షణముగల గుఱ్ఱ
మును గలవాఁడు త్వరితముగా యమసన్నిధానమునకేగును.

2 శంఖావర్తంబులు.

చ. కట నయనాంత మధ్యమునఁ ♦ గన్పడు శంఖయుగంబు దానిపై
బటుగతిఁ దోఁచు నా సుడులు ♦ బాల్పడు శంఖ సమాఖ్య నిద్దిని
క్కుటమగు దోష మిట్టిహరి ♦ గూడమనిల్పగ నిల్పెనేని య
క్కుటకట భర్త నంతకని ♦ కాయ గమీషువుఁ జేయుఁ గొక్కుటన్

తా. కణతలకు కనుగొనలకు నడుమ శంఖముఁ నిచెప్పఁబడును. ఇవే చెంపలు.
ఇట్టి చెంపలమీఁద రెండువయిపుల రెండుసుళ్ళుండెనేని శంఖావర్తము
లని చెప్పఁబడును. ఇట్టిగుఱ్ఱ మింటనుండెనేని దానికర్తనంతకాలయ
మున కంపును.

3. గండావర్తము.

చ. అరయఁగ నాసికా హను ప ♦ దాంతరముల్ దగు గండ భాగముల్
పరువడినట్టి గండములఁ ♦ బైకొని సుళ్లు ఘటిల్లెనేని య

తురగము నుంచవల్లభునిఁ • ద్రోచును గండములం దనారతం
బురువగు దద్విసర్జనము • యోగ్య ఫల ప్రద మందు రుత్తముల్.

తా. నాసిక మొదలు హనువులవఱకునుండు ప్రదేశములు, అనఁగాఁ జెక్కిళ్లు గండస్థలములు రెండువయిపుల రెండుసుళ్లుండెనేని గండావర్తములు. ఇట్టిగండావర్తములుగల గుఱ్ఱము భర్తకెపుడును గండములు గలుగఁ జేయును. కాన నిట్టిగుఱ్ఱమును వెంటనే విడిచివేయవలయునని పెద్దలు చెప్పుదురు.

## 4. శోకావర్తము.

ఉ. మైకొని గండ ఘోణముల • మధ్యమునం దగు నశ్రుపాతముల్
జోకగ నశ్రుపాతముల • సుళ్లు ఘటిల్లెడు నేని వానికిన్
శోక సమాఖ్యయౌ బతికి • శోక మిడుం దరుగంగనీక యు
ద్రేకము గాఁగ నట్టి హరిఁ • జూడఁగ రాదని పల్కి రుత్తముల్

తా. గండస్థలమునకును ఘోణమునకును మధ్యమునందుఁగన్నులముందటికొలకుల క్రిందటిమూఁడంగుళములపొడవుగల ప్రదేశమునకు అశ్రుతపాతమని పేరు. అశ్రుతపాతమునందు అనఁగాఁ గన్నులముందటికొలకులనుగానియడి మొదలు మూఁడంగుళములవఱకుఁ గ్రిందుగాఁగాని రెండువయిపుల కనుల క్రింద రెండుసుడులుండెనేని వానిపేరు శోకావర్తములు. ఈలాగంటి సుడులుగల గుఱ్ఱము భర్తకెల్లకాలమును శోకమును దరుగనీయక గలిగించును గాన దానిని జూడరాదు॥

## 5 ప్రోథావర్తము.

చ. కుటిలముగాని నిశ్చయము • ఘోటకశాస్త్రమతంబు నాసికా
పుటముల మధ్య భాగమున • ప్రోథమనంబడు నట్టిచోట సం
ఘటితముగాగ నాసుడి యొ • కండు మహోన్నత దోషభాగమ
శ్కటకట భర్తనెల్లప్పుడు • గాఢ విపద్వినిమగ్నుఁ జేసెదున్॥

తా. అశ్వశాస్త్రమతమునందు ముకుజెముకులు నడిమిప్రదేశము ప్రోథమని చెప్పఁబడును. అట్టి ప్రోథమందుఁబుట్టినసుడి ప్రోథావర్తము ఇట్టి లక్షణముగల గుఱ్ఱము భర్తకు అపరిమితవిపత్తులు గలుగజేయును.

## 6 హృదయావర్తము.

ఉ. మానుగ రెండు బాహువుల ♦ మధ్యమునన్ హృదయంబు నాఁబరుం
బూని హృదబ్జపీఠమునఁ ♦ బొల్పు సుడిం గని సైంధవంబు నే
మానవుఁ డింటనుంచు నను ♦ మానము లేదిక వాఁడు భాను మ
త్సూనుని మందిరాంగణముఁ ♦ జూచుఁ జవం బ్వరిత క్రియారతిన్॥

తా. రెండు బాహువుల నడిమి ప్రదేశము హృదయ మనఁబడును. హృదయస్థలంబునఁ బుట్టిన సుడి హృదయావర్త మనంబడును. ఇట్టి లక్షణము గల యశ్వమెవని యింట నుండునో వాఁడు త్వరితముగా యమసన్నిధానమున కేగును॥

## 7 వహావర్తము.

మ. నెరి కేశాంత పదంబు నంటి వెనుకన్ ♦ నిల్పు న్వహస్థానముల్
పరికింపంగ వహప్రదేశముల నా ♦ వర్తంబు లొప్పారు నా
తురగం బుంచఁగ రాదు పెద్దలు మహా ♦ దోషంబుగాఁ జెప్పుటన్
న్నరులం జెప్పఁగ బూన నేల సురలై ♦ నం జంపు నవ్వేత్తుగన్॥

తా. కేశాంత స్థలములనంటి వెనుక యిరుప్రక్కల వహస్థానములని చెప్పబడును. అట్టి వహస్థానముల మీఁద కేశావళికి రెండుప్రక్కల రెండు సుడులుండెనేని అవి వహావర్తములు. ఈలక్షణములయశ్వము దేవతల నయినం జంపునఁట నరుల సంగతిఁ జెప్పవలసిన దేమున్నది.

## 8 కకుదావర్తము.

చ. మొనయును కొకసంబు పయి♦మూపుర మద్ది కకుత్సమాఖ్యచే
దనరును దత్ప్రదేశమున ♦ దాల్పు సుడిం గని వాహ మింట బు

ట్టిన మొగమెత్తి చూడ కపుడే ♦ రిపుభూపతులేలు భూమికిన్
గొనకొని పొలఁదోలవలె ♦ ఘోటక శాస్త్ర మతం బెఱింగినన్

తా. కాకస ప్రదేశమునకు మీఁదిభాగము కకుదము. అదే మూపురమనఁబడును. అట్టి మూపురముపై నుండెడిసుడి కకుదావర్తము. సాధారణముగా నిది జీనుకట్టు టఁగువారి క్రిందనుండును గావున దీనినే పట్టెడసుడియందురు. ఇట్టి లక్షణముగల యశ్వ మింటఁబుట్టిన దయినను తత్క్షణము తన విరోధులయిన రాజు లేలెడు భూమికిఁ బొలఁదోలవలెను గాని తాను గ్రహించరాదు.

### 9 కక్షావర్తము.

చ. వెలయును బాహుమూలముల ♦ వెన్కటి ప్రక్కలు కక్షసంజ్ఞలం
దలఁపఁగ నట్టి కక్షముల ♦ దాల్చిన సుళ్లు మహోగ్ర దోషము
ల్దొలఁగక యట్టి దుష్ట హరిఁ ♦ దోకొని యాజికిఁ బోవునేని యు
జ్జ్వల రిపు చండ కాండ హతిఁ ♦ జక్కఁడగున్ నృపుఁడింద్రుఁడేనియున్

తా. బాహువు మొదట వెనుకప్రదేశములు కక్షములు. అనగాఁ జంకలనఁబడును. అట్టి చంకల మీఁద రెండు సుడులుండెనేని అవి కక్షావర్తములు. ఇట్టి యశ్వము నెక్కి యుద్ధమున కేగువాఁ డింద్రుఁడయినను శత్రువుల బాణములపాలై బ్రతుకుటకు సంశయము లేదు.

### 10 ఘూర్ణావర్తములు.

శా. పీకన్ బార్శ్వములొప్పు గాత్రముల వె ♦ న్కన్కన్ హయ శ్రోణికిన్
మ్మూకొ వర్తములుండు బ్రక్కలపయి ♦ న్నాల్గన్నసుళ్ళు స్ఫురా
నీకం బద్ధము నున్న నట్టి హయము ♦ న్నిక్కంబుగా నొక్కవాఁ
డాకంపించి విరోధి మార్గణ హతుం ♦ డై మూలు ఘోరాజిలోన్ ||

తా. కక్షముల వెనక ప్రదేశములు పార్శ్వములు. ఇవ్వే ప్రక్కలనఁబడు. రెండు ప్రక్కల మీఁదను రెండు సుడులుండెనేని యవి ఘూర్ణావర్తము లనఁబడును. వీనినే పార్శ్వావర్తములనియుం జెప్పుదురు.

ఇట్టి యశ్వము నెక్కినవాఁడు దేవతలడ్డపడినను యుద్ధరంగమునందు శత్రువులచేఁ దప్పక హతుండగును.

11 పృష్ఠావర్తములు.

చ. పిరుదల కూర్ధ్వ భాగమునఁ ♦ బృష్ఠమిదే తగ వీపనం బడుం
దురగము పృష్ఠభాగమునఁ ♦ దోఁచిన యా సుడి భూరి దోష వి
స్ఫురణము దానిఁ జూచి రవిఁ ♦ జూచి జలంబుల మున్గ శుద్ధుఁడౌ
నరుఁడల సైంధవంబుఁ గొని నం ♦ జను నంతకు చెంత కంతటన్॥

తా. పిరుదులకు మీఁది భాగము పృష్ఠము. ఇదే వీపనియు వెన్ననియుఁ జెప బడును. ఇట్టిచోఁ గలిగిన సుడి పృష్ఠావర్తమనంబడు. ఇట్టి యశ్వమును జూచుట మహాదోషము కావున వెంటనే సూర్యునిజూచి స్నానముచేసినంగాని శుద్ధుఁడుకాడు. ఇట్టి యశ్వము నెక్కిన వాఁడా లస్యములేక యముని యొద్దకుఁ బోవువాఁడు కాగలఁడు.

12 పుచ్ఛావర్తములు.

క. పుచ్ఛము మొగటం బుట్టిన
బుచ్ఛావర్తంబు లనఁగఁ ♦ బొలుచు నిఱు సుడుల్
తుచ్ఛ ఫలంబులు రిపు శర
విచ్ఛిన్న శిరస్కుఁ జేయు ♦ విభు న్నద్దవిడిన్ 70

తా. తోక మొదట నిరుప్రక్కలను రెండు సుడులు పుట్టెనేని యవి పుచ్ఛావర్తము లనఁ బడును. ఇట్టియశ్వము కడుకీడు. దీనిఁగలవాఁడు శత్రువుల బాణములచే తల తెగఁ గొట్టఁబడును.

13 జాన్వావర్తములు

క. పెందొడల క్రింద జానులు
ముందటి యిరుకాళ్ళ జాను ♦ మూల మిరు సుడుల్
జెందిన జాన్వావర్తము
లందురు పతి నంతకాల ♦ యాతిథిఁ జేయున్॥ 71

తా. పెందొడల క్రింది ప్రదేశము మోకాళ్ళ వఱకును, అనగా మోకాళ్ళ పయి భాగము మొదలు లావుపాటి తొడల వఱకు నీమధ్య భాగము జానువులనఁబడును. ముందరి కాళ్ళు రెండును యీ జానువులు రెండింటిని మీదను రెండుసుడులుండె నేని యవి జాన్వావర్తములు. ఈ సుడులు గల గుఱ్ఱము భర్తను యముని యొద్దకు తప్పక పంపును.

## 14 జంఘావర్తములు.

క. మోకాళ్ళ దిగువ జంఘిక
లాకడ వలుగాళ్ళ నాలు • గై సుడులున్నం
బ్రాకట జంఘావర్తము
లాకమలజు డడ్డ పడిన • హతుఁ జేయుఁ బతిన్‖ 72

తా. మోకాళ్ళదిగువ డెక్కలవఱకు నుండునవి జంఘలు, ఇవే పిక్కలు. ఈ పిక్కల మీద నాలుగు కాళ్ళను నాలుగు సుడు లుండిన జంఘావర్తము లనంబడును. జంఘావర్తములున్న యశ్వము బ్రహ్మదు లడ్డపడినను భర్తను జంపక మానదు.

క. రూపింప నీ ప్రదేశము
లౌపదు నాల్గింట నిరువ • దాఱు సుడులాగిం
జూపట్టు మహాదోషము
లై పటు దుష్ఫలములందు రశ్వ విధిజ్ఞుల్‖ 73

తా. ఈ పదునాలుగు లక్షణముల యందును నీ పదునాలుగు ప్రదేశముల యందుగలుగు నిరువది యాఱు సుడులు మహాదోషములని యశ్వశాస్త్రజ్ఞులు చెప్పుదురు

క. ఇవి సర్వ కాల దోషము
లవు నివి గల వాజి త్యాజ్య • మగు నని నకులా
ది విశిష్ట ఘోట శాస్త్ర
ప్రవణుల మత మిట్టి వారి య • పాయము సేయున్‖ 74

తా. ఈపమనాలుగును సార్వకాలికదోషము లివి గల గుఱ్ఱమును త్యజిం చవలెనని నకులాదుల మతము.

క. సామాన్య దోషము లనం
గా మఱియును నిరువదాఱు • గలవవి తెలయుల్
నామములు ఫలములు బుధ
గ్రామణు లౌనన(గ జెప్ప( • గా( బడు నిచటన్॥ 75

తా. ఇ(క సామాన్య దోషములు నిరువదియాఱు గలవు. వాటి ప్రకేశ ములు పేరులు ఫలములతో గూడ ని(క ముందు చెప్ప(బడుచున్నవి.

## 1 నాసావర్తములు.

క. ముక్కు జెమరులందున సుడు
లక్కజముగ( గల్గ నాసి • కావర్తములౌ
నిక్క యది యెక్కు నాతని(
బెక్కు తెరంగులను రోగ • పీడితు( జేయున్॥

తా. ముక్కు జెమరులు రెండిటను రెండు సుడులున్నవవి నాసావర్తము లనబడును. అగుఱ్ఱమెక్కువాని కపరిమిత పీడలు గలిగించును.

## 2. అధరోష్ఠావర్తము

క. క్రింది పెదవి యధరోష్ఠం
బందుండిన రెండు సుడులు • నధరోష్ఠాఖ్యం
జెందు నది నిజాధిపునకు
మంద దరిద్రత నొసంగు • మపలక నెంచున్॥

తా. క్రిందిపెదవి యధరోష్ఠమన(బడును. అచ్చట రెండు సుడులుండినచో, నధరోష్ఠావర్తము లన(బడును. ఈ లక్షణముండిన యశ్వము భర్త కత్యంత దారిద్ర్యవంతుని(జేయును.

### 3. ఉత్తరోష్ఠావర్తము

ఆ. ఉత్తరోష్ఠమనగ ♦ నొగి మీఁది పెదవి యా
నందు సుడి వహించు ♦ నశ్వమెపుడు
భర్త కతుల రోగ ♦ బహుళాపదలుసేయు
నందు రశ్వవేదు ♦ లయిన వారు॥

తా. మీదిపెదవి యుత్తరోష్ఠమనఁబడు నందుండవలసిన ధ్రువావర్తము గాక మఱియు నొక్క సుడి గలిగెనేని యుత్తరోష్ఠావర్తమనఁబడును. ఇది భర్తకపరిమిత రోగములు ననేకాపదలును గలిగించును,

### 4. ఘోణావర్తము.

ఆ. ముక్కు జెమరులందు ♦ మొదలు కన్నుల దాఁక
ఘోణ మందు రందు ♦ గూడిన సుడి
భూరి దోషఫలము ♦ పుత్రశోకద మంచు
నశ్వ శాస్త్ర వేదు ♦ లందు రవని॥

తా. ముక్కు జెమరలు మొదలుకొని కనుల వఱకునుండు మిట్టమీది భాగము ఘోణ మనఁబడును. దాని మీది సుడి ఘోణావర్తము. ఇ పుత్రశోక ప్రదము గాన నిట్టి సుడిగల యశ్వము నుంచరాదు॥

### ప్రపాణావర్తము.

ఆ. ముందు పెదవిమీద ♦ ముకుగోళ్ళ దాఁక ప్ర
పాణ మనఁగఁ దనరు ♦ దానిమీఁద
మూఁడు సుళ్లు గలుగ ♦ మోసమౌఁ దనకు సో
దరుల కట్టి వాజి ♦ దడవరాదు॥

తా. మీది పెదవి పయినుంచి ముక్కు గోళ్ళవఱకు ప్రపాణ మనఁబడును దానిమీద మూఁడు సుళ్లుండెనేని యది తనకును తన సోదరులకును హానిచేయును॥

## 6 భ్రమావర్తము.

క. కను బొమలు రెంటిమీఁదం
గనుఁ గొనఁగా రెండు సుడులు • గలిగిన వాజిం
గొనరాదు రోగ బాధా
ద్యనుపమ దుఃఖములు సేయు • నందురు తద్జ్ఞుల్॥

తా. కనుబొమలు రెంటిమీద రెండు సుళ్ళుండిన నవి భ్రూయుగావర్తములు. ఇవి గల గుఱ్ఱము దుఃఖములు గలిగించును గాన దానిఁ గొనరాదు.

## 7 కర్ణావర్తము.

క. వెలవుకొని రెండు చెవులం
గలిగిన యా రెండు సుడులు • కర్ణావర్తం
బులు కర్ణ హీనుఁ జేయుౘ
విలువఁగ రాదట్టి తేజి • వేదురు లైనన్॥

తా. చెవుల మీఁద రెండిటను రెండు సుళ్లుండుట కర్ణావర్తములు. ఇది కర్త కర్ణ హీనునిజేయును గాన దాని గొనరాదు.

## 8 విధ్వావర్తములు.

క. చెవుల వెనుక పెడతలపైఁ
దవులను విధుయుగళి మందఁ • దగు రెండు సుడుల్
ధవు మ్రింగు నందురా రా
హువు చంద్రుని మ్రింగునట్టు • లొప్పదె హరికిన్॥

తా. పెడతల యందు చెవుల వెనుక ప్రక్క విధులని చెప్పబడు నావిధువులు రెంటను రెండు సుళ్ళుండిన గుఱ్ఱము తన పతిని చంద్రుని రాహువు మ్రింగినటు మ్రింగునందురు.

## 9 హన్వావర్తములు.

ఆ. గండ ఘోటములకుఁ • గల వెలుపలి ప్రక్క
హనువులంద్రు దవడ • లవియె హరికి
హను తలములు రెంటి • యందును రెండు సు
ళ్ళున్నఁ గొనరు దాని • నెన్నఁడేని॥

తా. గండ ఘోటకములకు వెలుపలి ప్రక్క హనువులనబడు నివియే దవడలు వీని రెంటి మీఁద రెండు సుళ్ళున్న యెడల నట్టి వారువము గొనరాదు.

## 10 గళావర్తము.

క. గళ మగు నిగాళ కంఠం
బుల నడుమ చోటునందుఁ బుట్టిన సుడి దాఁ
గలిగించుఁగర్త కనిశము
నల జళ్ళా వాజి నుంచ • రశ్వ విధిజ్ఞుల్

తా. నిగాళ ప్రదేశమునకును కంఠమునకును మధ్యప్రదేశము గళమన బడును. దాని మీఁద గల సుడి గళావర్తము. ఇది దుఃఖకరము గాన దాని నుంచరాదు.

## 11 స్కంధావర్తము.

క. గ్రీవకును మీఁదు కందము
తావగు నిరుప్రక్కలందుఁ • దగు రెండు సుడుల్
కేవల దోషాస్పదములు
భూవరు లావాజి ముట్టఁ • బోరాక నాఁడుఁ॥

తా. గ్రీవ యనగా కంఠ నాళము ననుసరించినది. ఆగ్రీవకు మెడ మీద వెంట్రుకలకును నడుమనుండునది స్కంధము. స్కంధము మీఁద రెండు వైపులను సుళ్ళుండిన నది దోషమని చెప్పుదురు.

## 12 ఘోటావర్తము.

క. కటక శంఖ తలములకు మీఁ
దటి భాగము ఘోటమందు ♦ దగు సుడి యొక్కఁడుం
బటుతర దోషాస్పద మెం
తటి చెనటియుఁ గొనఁగ రాదు ♦ తాదృశవాజిన్॥

తా. కటకములకు శంఖ స్థలములకును మీదిభాగము ఘోటమని చెప్పఁబడును. ఘోటమునందు సుడి గల గుఱ్ఱము నెంతటి దుష్టుఁడయినను గొనరాదు.

## 13 కాకసావర్తము.

క. ఎసగును జత్రులపై కా
కస మట యావర్తమున్న ♦ గంధర్వము ఘో
ర సమరమున రిపు భుజ లస
దసి విదళిత దేహుఁ జేయు ♦ నధిపతి నొకటన్॥

తా. జత్రుప్రదేశము మీఁది భాగము కాకసము. (ఇది ఇంచుమించు మూపురమని తోచుచున్నది.) ఇచ్చట సుడియుండిన యెడల నట్టి గుఱ్ఱము గ్రాహ్యముకాదు.

## 14 మన్యావర్తములు.

క. మన్నెలు మెడ బోలు నరము
ల న్నెలవుల రెండుఁ గడల ♦ నగు నిరు సుడులున్
గన్న హరి నుంచ నొప్పదు
క్రొన్నెల తాల్పునకునైనఁ ♦ గొఱగామి యగున్॥

తా. మెడకు వెనుకప్రక్కనుండు బోలునరములు మన్నెలని వాడబడును. ఇట్టి స్థలములయందు రెండు ప్రక్కల రెండు సుడులున్న యెడల

నట్టియశ్వము నుంచరాదు. సాంబమూర్తికి యంతటి వానికయిన గీడు తప్పదు॥

## 15 ఉత్తరావర్తము.

క. పొట్టకును రెండు ప్రక్కల
బుట్టిన యాసుడులు రెండు ♦ బుధ తతి వాడం
బట్టగు నుదరావర్తము
లట్టి హరి న్విడువ వలయు ♦ నాహరియైనన్॥

తా. రెండు ప్రక్కలకు నడిమిభాగము పొట్ట, అదే ఉదరము. దీని రెండు వయిపులను రెండు సుడులుండునేని అవి ఉదరావర్తములుకి ఇవిగల గుర్రము నావిష్ణుమూర్తి యయినను విడువవలెను.

## 16 క్రోడావర్తము.

క. క్రోడమన రొమ్మదానం
గ్రోడావర్తమన నడుమఁ ♦ గుదిరిన సిరి యా
కీడాత్తడి నుంచిన
వాడను వదలదని మున్ను ♦ పలికిరి తజ్ఞుల్॥

తా. రొమ్ముపేరు క్రోడము, దానికి నడుముగా నొక్క సుడియుండెనేని అది క్రోడావర్తము ఇట్టి సుడిగల గుఱ్ఱమున్న యూరిలోకూడా కీడువదల నేరదని పెద్దలు చెప్పెదరు.

## 17 నాభ్యావర్తము.

క. పొక్కిట నాభ్యావర్తము
మెుక్కలపు న్సుడి ఘటించు ♦ మూఢ తురంగం
బెక్కిన రౌతు శిరంబుం
జెక్కలుగా శత్రుసేన ♦ చెండాడు నొగిన్॥

తా. బొడ్డు మీద నొక సుడి యున్నచో నదియే నాభ్యావర్తము.

ఈసుడిగల యశ్వము నెక్కినవాఁడు శత్రువులచే నవశ్యము చంపఁ బడును.

## 18 త్రికావర్తము.

క. త్రికమున బృష్ఠాంతంబగు
త్రికజావర్తమన నచట • దేలిన సుడియౌ
ముకురు హరి నెక్కినరు మ
స్తకమరి నిశితాపి నిహతి • ధారుణి గూలుఁ ॥

తా. పృష్ఠమునకు దిగువ భాగము త్రికము. ఇదియే మొలయని చెప్ప వచ్చును. త్రిక[illegible] సుడి త్రికావర్తము. ఇది కడుఁగీడని చెప్ప[illegible]

[illegible]వర్తము.

## 21 పిండావర్తము.

గీ. గుదము నిరుపార్శ్వములను బి ♦ రుదులు బలసి
యుండు నెడలను పిండముల్ ♦ రెండు గడల
రెండు సుడులున్న తత్తడి ♦ యుండరాదు
కనుగొనిన భానుగని నీట ♦ మునుఁగవలయు.

తా. గుదము రెండు ప్రక్కలను బలిసి యెత్తుగానుండు ప్రదేశములు పిండము లనఁబడును. ఇవియే పిరుదులనఁబడును. వీటి రెంటిమీదను రెండుసుడులున్న నవియే పిండావర్తములనఁబడును. ఇట్టి యశ్వము నుంచరాదు. దీని జూచి సచేలస్నానము చేసినను దోషము తీరదు.

## 22 ఊర్ధ్వావ

క. వెను కాళ్ళ తొడలు నూరువు
లన బడునా రెంటి మీఁగ...

## 24 కళావర్తము.

క. కళ లన బడు మోకాళ్ళ
న్నెలవుల నలు గాళ్ళ నాల్గు ♦ నిలిచిన సుడులా
ఖ్యలను కళావర్తములగు
గలిగించును గర్త కతుల ♦ కష్టఫలంబుల్॥

తా. మోకాళ్ళు కళలనబడును, అట్టి మోకాళ్ళ మీదను నాలుగు కాళ్ళను నాలుగు సుడులుండిన గళావర్తము లనబడును. ఇవి కర్త కష్టము గలిగించును.




## 25 కుష్టికావర్తము.

ఆ. కుష్టికంబులండ్రు ♦ గోరిజల సంధులు
నాల్గు కుష్టికముల ♦ నాల్గు సుడులు
గలిగనేని కుష్టి ♦ కావర్తమందురు
ముట్టరాదు దాని ♦ నెట్టివాఁడు॥

తా. గోరిజలమీద సంధి చీలమండ, అది కుష్టికము. ఈనాలుగు కుష్టికముల మీద నాలుగు సుడులుండిన కుష్టికావర్తములు, ఇట్టి గుఱ్ఱమును ముట్టరాదు.

## 26 కూర్చికావర్తము.

క. గొఱిజలపై జంఘలతుద
నిరవగు కూర్చిక లనంగ ♦ నిలుచునలు సుడుల్
గుఱిగాఁజెట్టి తురంగము
తెలుగని యలజడులొసంగు ♦ తత్కర్తకొగిన్॥

తా. పిక్కలకు గొఱిజలకు నడిమి ప్రదేశమునకూర్చికలు, వీటిపైన నాలుగు కాళ్ళను నాలుగు సుడులుండిన గూర్చికావర్తములందురు ఇట్టి గుఱ్ఱము కర్తకు కీడు చేయును.

క. ఇఱువది యాఱగు సంఖ్యను
బఱగును సామాన్య దోష ♦ పద్ధతు లివి గు
త్తెఱిగి హరి విలువ వెళ్లయును
నెఱి వెలసిన యశ్వశాస్త్ర ♦ నిశ్చయ నిపుణుల్॥

తా. ఇవి యిరువది యారును సామాన్య దోషములు, వీటి లక్షణంబు
నెఱింగి మరి గుర్రమును గొనవలయును.

క. ఆవర్తలక్షణంబిది
ప్రావీణ్యులచేతఁ దెలుపఁ ♦ బడిన తెఱంగున్
భావించి చెప్పఁబడియెన్
ధీవరు లశ్వముల దీనిఁ ♦ దెలిసి కొనఁ దగున్॥

తా. ఇంత వరకావర్తలక్షణంబెల్ల దెలుపం బడియె నిది తెలిసికొని మతి
గుఱ్ఱమును గొనవలెను.

ఆ. తెలుపు నెఱుపు పసపు ♦ నలుపు వర్ణంబులు
జాల నలరునట్టి ♦ సైంధవములు
విప్ర భూతలేంద్ర ♦ విట్శూద్ర జాతుల
టంచుఁ దెలియఁ బరగు ♦ రశ్వ విదులు ॥

తా. తెల్లని గుర్రములు బ్రాహ్మణజాతులు, ఎర్రనివి క్షత్రియజాతులు.
పచ్చనివి వైశ్యజాతులు, నల్లనివి శూద్రజాతులు.

ఉ. నాలుగు కాళ్ళనుం జెవి కొ ♦ నల్ వదనంబును వాల భారమున్
జాలగ దెల్పులై వెలయు ♦ సైంధవ మొప్పగు నష్టమంగళా
ఖ్యా లలితంబుగాగ నది ♦ కర్తకు భర్తకు నుల్లసన్మహీ
పాలన వైభవంబును న ♦ పారసుఖంబు నొసంగు నెప్పుడున్॥

తా. నాలుగు కాళ్ళను, రెండు చెవులు కొనలను మొగమును, తోకయును
తెలుపై యుండునది అష్టమంగళియనఁబడును. అది కర్తకు రాజ్యవై
భవంబిచ్చును.

క. నాలుగు పదములు వదనము
జాలగ దెలుపగుచు నెసఁగు • సైంధవము గదున్
శ్రీలొసఁగు భర్త కెప్పుడు
గ్రాలెడు నామమునఁ బంచ • కళ్యాణియనన్॥

తా. నాలుగు కాళ్ళును, మొగమును దెలుపు గలది పంచకల్యాణి యనఁ బడు నది అతిశ్రీకరము॥

చ. జలరుహ శంఖ చక్ర హల • శార్ఙ్గ గదా ముసలార్క వేదికా
కలశ ఝషాంకుశ ధ్వజ సు • కచ్ఛప దర్పణ వజ్ర స్వస్తికో
జ్వల శర పంచ కోణ యుత • ఛత్ర సమాకృతు లొప్ప బొల్లులం
గల తురగంబు కర్తకధి • క స్ఫుట సంపద లిచ్చు నిచ్చలున్॥

తా. తామరమొగ్గ, శంఖము, చక్రము, నాగలి, విల్లు, గద, రోకలి సూర్యబింబము, యజ్ఞవేదిక, కలశము, చేప, అంకుశము, ధ్వజము, తాబేలు, అద్దము, వజ్రము, స్వస్తికము [అష్టకోణము] బాణము, పంచకోణము, గొడుగు యీ వస్తువులవంటి ఆకారముగలిగి ముఖమున బొల్లులున్న గుర్రములు మంగళకరములు॥

ఆ. తెంపు లేక నుదుటఁ • దీర్చిన యాబొల్లి
యెల్ల దోషములను • బొల్లజేయు
నడుము తెగిన మ్రింగి • వెడలఁ గ్రక్కక యున్న
బొల్లి కూడదంద్రు • బుధులు హరికి॥

తా. మొగాన తెంపులేకుండనున్న బొల్లిమంచిది బొల్లికోటిలోనికిఁబోయి మఱల క్రింది పెదవికి యెక్కకుండె నేనియు కొఱగాదు.

చ. పదములు నాలుగుం దెలుపు • పాటిలి సందగు మేలు మూటదె
ల్పొదవిన కాక నొండు తెలు • పొప్పినఁ బో విషపాది నామమై
యొదవి కడుఁ గీడు చేయు నిర • యం జరణ ద్వితయంబు తెల్పుగా
బొదలిన మేలు కీ[illegible] • పొంద దటంద్రు [illegible]

తా. నాలుగు కాళ్ళు తెలుపగుట మంచిది, ఒక కాలుగాని మూడు కాళ్ళుగాని తెలుపగుట విషపాది యనంబడు నిదిక్షోర గాదు. రెండు కాళ్ళు తెలుపగుటయేమి ఫలములేదని చెప్పనురు.

సీ. తెల్ల జీరను వీపు • దిరిగి ప్రవాళపు
చాయయై యుండుట • చాలలెస్స
తనువొండు వన్నెకం • దము తెల్లనై యున్న
సమరతలంబున • జయమొసంగు
వీపును దండెంబు • వెల్లనై మొగమున,
బొల్లి యుండిన మేలు • బొదలఁజేయు
తోపు చుట్టినయట్లు • తోరంపుచీరమై
చుట్టిన గర్తకు • శుభమొసంగు

గీ. చీర చుట్టిన చందాన • చార గల్గి
వెల్లనై కడుపు క్రింద రా • జిల్లునేని
కర్తకుజ్వల శుభ పరి • స్ఫూర్తిచేయు
ననిరి హయశాస్త్ర విజ్ఞాత • లైన మునులు॥

తా. ఎట్టిదియశ్వమునకు వీపువెంబడి తెల్లజీరచుట్టియుండినను, శరీరమే వన్నెయయినను కందము వెంద్రుకలు తెల్లనయియుండినను, వీపు దండెము వెల్లనయి మొగమున బొల్లియుండినను, వేరు వన్నెగలిగిన వీపువెంబడి యెర్రచార చుట్టియుండినను, చీరచుట్టినట్లు మేనిమీద చారలు గలిగి కడుపు క్రింద తెల్లనైయుండినను, ఇట్టి యశ్వములు రాజవాహనములనఁబడును. కర్తకు మేలుగావించును.

క. కన్నులు ముక్కుం జెవులును
వన్నెం దెలుపమరి నట్టి • వాహము పతికిం
గ్రన్ననఁ జేకూర్పు మహో
న్నత విభవాయురిష్ట • సంసిద్ధులొగిన॥

తా. కన్నులు ముక్కు చెవులును తెల్లనయి యుండినట్లయితే యట్టి యశ్వము కర్తకు శుభప్రదమగును.

గీ. గొరిజలును కందమును వెల్ల ♦ కొంగ దందు
రిట్టి హరి భర్త కభిమతం ♦ బిమ్మచుండు.
చిత్రవర్ణంపు హయమిచ్చు ♦ శత్రుజయము
ముందు తెల్పెర్పు వెన్కయై ♦ మోవ నొసఁగు॥

తా. గొరిజలును కందము వెంద్రుకలు వెల్లనయి యున్నను చిత్రవర్ణము కలదియయినను ముందుభాగము తెలుపు, వెనుక భాగము ఎఱుపు అయియుండినను అశ్వము మేలుసేయును.

క. దండెము నొడలును కందము
వెంద్రుకలును విశద రుచుల ♦ వెలయుచు హరికిన్
మెండుగ గొరిజలు కన్నులు
నిండి నలుపు గల్గి యధిపు ♦ నృపతిం జేయున్॥

తా. దండెమును, ఒడలును, కందము, వెంద్రుకలును, తెల్లనయి కన్నులు గొరిజలు నల్లనయియున్న యశ్వము మేలుసేయును.

క. అంగుడును దండెమును శిర
ముం గొరిజలు కోశ మండ ♦ ములు పేంచక భా
సంగతములయిన హయమున్
వెంగలియుం గట్టరాదు ♦ విడుచుట యొప్పన్॥

తా. అంగుడును, దండెమును, శిరస్సును, గొరిజలును, శిశ్నమును, అండములును నల్లనయియున్న యశ్వము కొనరాదు.

సీ. పండ్లు నల్లనివైన ♦ పఙ్క్తి లేకుండిన,
తక్కువయైయున్న ♦ నెక్కువైన
చిప్పపండ్లయినను ♦ చెడి యూడిపోయిన,
హయము కర్తకు మహా ♦ హాని సేయు

వండములున్నదైన • నవి యొక్కటిగ నున్న,
చిక్కనై రోమము • లిక్కి యున్న
పండ్లతోఁ బుట్టిన • బగలు పుట్టిన నండ,
ముల మీఁదఁ జారలు • గలిగియున్న

గీ. వానరాండమైన • స్వామికిఁ గడుఁ గీడు
జాను కక్ష కోశ • సంఘలంపు
నలుపు మిగిలెనేని • తలయొక్క వన్నెయు
దండె మొండు వన్నె • తగదు కొనఁగ॥

క. పవలింటం జనియించిన
కవలై పుట్టినను పండ్లు • కలిగి పొడమినన్
దివిజేంద్రుఁడైన నాశ్వం
ధవముం గొనరాదు కీడు • తప్పక కలుగున్॥

తా. పగలు పుట్టినను రెండు పిల్లలుగా పుట్టినను పండ్లు కలిగి పుట్టినను ఆ గుఱ్ఱము కీడు చేయును.

సీ. వజ్రాబ్జరాగ ప్ర • వాళ గోమేధిక,
మరకత నీల స • మానరుచుల
బర్హిబర్హా ద్యుతి • పంకజ రుచి వింద్ర
గోపకాంతిని చిత్ర • రూపమునను
విలసిల్లి శుభలక్ష్మ • విశ్రుతిమై మృదు,
గంభీర ఘోషమై • కనుల మెఱుగు
గలిగి యందము మీరి • గంధంబు సురభిగా,
జని సత్వముల జన • శ్లాఘ్యతగని

గీ. సంతతామోద సుమహిత • స్వాంతమగుచు
సుగుణములు గల్గి మిక్కిలి • చూడ నొప్పు
నట్టి గుఱ్ఱము రాజవా • హనమటందు
రశ్వ విజ్ఞాన నిర్ణయు • లైనమునులు॥

## కొలప్రమాణము

చ. కడగి ఖురాగ్ర మాదిగను ♦ కాకస దేశము దాఁక గొల్వగా
పాదవు శతాంగుళంబులయి ♦ పొల్పగు నుత్తమ సప్తికంత నా
వడువున జూడ మధ్యమపు ♦ వాజికి తొంబది దానికిం బదిన్
గడమగు నీచమానమున ♦ గల్గిన జక్కికి నున్నత స్థితుల్॥

చ. వారికి ప్రపానపాళి మొద ♦ లాగుదవ త్రిక దాఁక గొల్వనూ
టిరువది యంగుళంబులగు ♦ హీనపు వాజికి మధ్యమాశ్వమ
దరయగ నూటముప్పదగు ♦ నంతకు నైబది యంగుళంబులం
[illegible] మాశ్వపరి ♦ మాణమునాయత మాన మందిలన్॥

## దశాక్షేత్రవిభాగ

క. అరుణాంభోరుహ పత్త్ర
స్ఫురణంబై వెలయు జిహ్వ ♦ నూనంబనగా
బరగును జిహ్వాధః స్థల
మిరవగు తాలువులు జిహ్వ ♦ కిరు పక్కియలన్॥

తా. జిహ్వక్రింది ప్రక్కను నూనమనబడును. దాని కిరు ప్రక్కల నుండు దవడల పేగు తాలువులనబడును.

గీ. నడుమ వ్యంజన దంతము ♦ ల్నాల్గు కోర
లిరుగడల రెండు రెండుగ ♦ మరియు ప్రక్క
దంతములు రెండు రెండిట్లు ♦ దనరు నైన
నిరువదియు నాల్గు పండ్లగుఁ ♦ దురగములకు॥

తా. నడుమ పండ్లు నాలుగు కోరలు రెండు ప్రక్కల రెండేసి చొప్పున నాలుగు మొత్తము పండ్రెండు క్రిందను యిట్లే పండ్రెండు మీఁదను వెరసి యిరువది నాలుగు పండ్లుండును.

క. పలువరుస కప్పుగా నై
న్నలరెడు నోష్ఠములు క్రింది ♦ దధరోష్ఠము పై

నల యుత్తరోష్ఠ మదియం
గుళములు నాల్గింటి నిడివి ♦ కొలువగ నమరున్॥

తా. పలు వరుసను కప్పియుండు పెదవులలో క్రిందిది అధరోష్ఠము మీదిది ఉత్తరోష్ఠము. నాలుగంగుళముల ప్రమాణము గలిగి యుండును.

క. నెలకొను పెదవుల సందులు
చెలివెలు హయ జాతిక కమరు ♦ సృక్వణము లనన్
లలి నధరోష్ఠము క్రిందట
నల రెడు చుబుకంబు గడ్డ ♦ మందురు దానిన్॥

తా. పెదవులసంధులు, చెలివెలు సృక్వణము లనఁబడును. అధరోష్ఠము క్రిందట చుబుక ముండును ఇదే గడ్డము.

ఆ. ఉత్తరోష్ఠమునకు ♦ నూర్ధ్వమంగుళ యుగ్మ-
పరిమితమునఁ దగు ప్ర ♦ పాణమనఁగ
దాని మీఁద ప్రోథ ♦ తలము మూఁడంగుళుల్
బరిమితముగ నిలుచుఁ ♦ దురగములకు॥

తా. ఉత్తరోష్ఠమునకు పయిన రెండంగుళముల పరిమితి ప్రపాణమనియు దాని మీద మూడంగుళములు ప్రోథమనియుఁ, జెప్పఁబడుననుట.

గీ. ప్రోథమున కిరుప్రక్కలఁ ♦ బొలుచు నాసి
కాపుటంబులు త్ర్యంగుళ ♦ క్రమ పరిమితి
ప్రోథ నేత్రాంతరము నఁబెం ♦ పొందు ఘోణ
మది పదాఱంగుళము లందు ♦ రశ్వ విదులు॥

తా. ప్రోథమున కిరువంకల మూడంగుళములు ప్రమాణముతో నాసికా పుటములుండును. కన్నులకును ప్రోథమునకును మధ్యఘోణమనఁబడును. అది పదాఱంగుళముల ప్రమాణమని యశ్వశాస్త్రజ్ఞులం చెప్పుదురు.

గీ॥ ఘోణ మిరు వంకలందు నం ♦ గుళములైదు
పరిమితంబుగఁ గల్లముల్ ♦ బరగుచుండు
నాసికా హను సంధుల ♦ డాసి గండ
ములు షడంగుళ మానత ♦ నిలుచు హరికి॥

తా. ఘోణమున కిరు ప్రక్కల నైదంగుళముల పరిమితమున గల్లములును నాసికాహను సంధులయందు గండము లారంగుళముల ప్రమాణమున నుండును.

గీ. గండ ఘోణములకు మధ్య ♦ కనుల దిగువ
నశ్రుపాతములొప్ప మూఁ ♦ డంగుళముల
నశ్రుపాతములకు మీఁద ♦ నంగుళత్ర
యాంతరమ్మునఁ గన్నులిం ♦ పారుచుండు॥



తా. గండఘోణముల మధ్య మూఁడంగుళముల ప్రమాణమున నశ్రుపాతములుండును, వాని మీద మూఁడంగుళములలో కన్నులుండును.

ఆ. నేత్రములకు మీఁద ♦ నేత్ర కూటము లొప్పుఁ
బొలుచు వానిమీఁద ♦ భ్రూయుగంబు
భ్రూయుగాంతరమునఁ ♦ బొసఁగు ఫాలంబు
నుహి షడంగుళప్ర ♦ మాణగుగుచు ॥

తా. నేత్రములకు మీద నేత్రకూటములకు వానిమీద కనుబొమ్మలును కనుబొమ్మలమధ్య నారంగుళముల పరిమితమున ఫాల ప్రదేశము నుండును.

క. ఓలిం బ్రబహాన మాదిగ
ఫాలాంతంబై తనర్చు ♦ బధము క్షేత్రం
బీలీల శుభా శుభల
క్ష్మాలి వయః ప్రథమ దశను ♦ దంచితముగన్॥

తా. ప్రపానము మొదలు ఫాలము వరకు నీ చెప్పిన స్థలములన్నియు ప్రథమక్షేత్రంబనంబడు ఇందుంగల మేలుకీడు సుడులువయః ప్రథమ దశయందు ఫల మిచ్చును.

ఆ. ఫాల తలముమీఁదఁ◆బరగు నంగుళ పరి
మాణమై స్తుతంబు◆దాని మీఁద
పరిపడంగుళములు◆శిరము శిరస్సుపై
నమరు కర్ణములుష◆డంగుళములు॥

తా. ఫాలముమీద అంగుళ ప్రమాణమై స్తువమును దాని మీద అరంగు ళముల పరిమితమై శిరస్సును శిరస్సు మీద నారంగుళములు కర్ణము లును ఉండును.

క. శిరము పయి చెవుల మొదలగ
బరగును విఘు యుగము నయన◆ పరి సరస కటాం
తరమున శంఖ యుగంబుం
బరువడి నంగుళ యుగ ప్ర◆మాణము వెలయున్॥

తా. శిరస్సు మీద చెవుల మొదట విఘు యుగమును నేత్రకటముల మధ్య మున రెండంగుళముల ప్రమాణమున శంఖ యుగమును గలుగును.

గీ. కర్ణ శంఖాంతరంబుల◆ గటము లొప్పు
నంగుళద్వయ పరిమాణ◆ మతిశయిల్ల
ఘోటములు శంఖయుగముపై◆ వాటమగును
హనువు లొప్పారు కంఠ ఘో◆ ణాంతరముల॥

తా. కర్ణ శంఖ మధ్యంబున రెండంగుళముల పరిమాణమున కటములు శం ఖములపై బడిన ప్రదేశమును ఘోణములును కంఠ ఘోణముల మధ్య మున హనువులును కలుగును.

గీ. కంఠ హనువుల మధ్యని◆ గాళ మెసఁగు
వంగుళ విశాల మగుమను◆ హయములకును

స్తువము మొదలు నిగాళంబు ♦ దాఁటి యిది ద్వి
తీయ మగు క్షేత్రమందురు ♦ ధీరమతులు॥

తా. కంఠ హనువులకు మధ్యమంగుళ ప్రమాణ వైశాల్యమై నిగాళ మనం బడు ఈ చెప్పిన స్తువాది నిగాళ పర్యంతముగల యది ద్వితీయక్షేత్ర మని చెప్పబడును.

గీ. పొలుచు పెడతల నుండెడు ♦ బోలు నరము
లశ్వములకు మన్యా సమా ♦ హ్వయములగుచు
గళ మగు నిగాళమునకును ♦ గంఠమునకు
మధ్యమున నంగుళి యుగప్ర ♦ మాణ మగుచు॥

తా. పెడతల నుండెడు బోలునరములు మన్యలని చెప్పబడును. నిగాళము నకు కంఠమునకు మధ్యమున రెండంగుళములపరిమాణము గళముండును.

క. గళ వక్షంబుల నడుమం
జెలువగు కంఠంబు గ్రీవ ♦ చెన్నగు నటపై
గలుగుం గంధం బాపై
వెలయుం గేశాళి శిరము ♦ వెనుక నటపయిన్॥

తా. గళమునకు వక్షస్థలంబునకు మధ్యకంఠము. ఇది అడుగుభాగము. దీని పైభాగము గ్రీవయన బడును. గ్రీవ మీఁదకంఠము దీనిమీఁద వెంట్రుకలు కేశాళి ఇది శిరస్సు వెనుక వరకు నుండునవనుట.

ఆ. శిరము మీఁద వెనుకఁ ♦ జెలఁగు గేశాంతముల్
వాటి పరిసరంబు ♦ వహాతలములు
మన్యలాదిగాఁగ ♦ మలయు నియ్యది తృతీ
యాఖ్యమైన క్షేత్ర ♦ మశ్వములకు

తా. శిరస్సు వెనుక కేశాంతములును వాటి పరిసరంబున వహాస్థలములును ఉండును. ఇట్టి మన్యాది ప్రదేశములు తృతీయక్షేత్రమని చెప్పఁ బడును॥

గీ. బాహు యుగ మధ్యమంబున ♦ పక్షమడరు
జత్రువులు బాహుశిఖల సం ♦ స్థాశ్రితములు
కాకసముజత్రు దేశ సం ♦ గిలము మీద
కాకసాగ్రతలంబున ♦ గకుద మెప్పు॥

తా. ముందటి కాళ్ళసందు ముందటి ప్రదేశము వక్షస్థలము బాహుల శిఖలు అనగా మూపులుసందులు జత్రువులు జత్రువులమీద కాకస ప్రదేశము కాకసపై కకుదము. ఇదే మూపురములు॥

గీ. అరయవక్షస్థలం బాది ♦ యగుచు గకుద
మంతముగ గల్గు నది తురీ ♦ యమగు క్షేత్ర
మశ్వశాస్త్ర పరిజ్ఞాత ♦ లైనయట్టి
నకుల భోజాది కుల మత ♦ మకుటిలముగ॥

తా. వక్షస్థలము మొదలు కకుదము వరకు గల యీ చెప్పినది చతుర క్షేత్రమనుట॥

ఆ. వక్షమునకు దిగువ ♦ వర్తిల్లు క్రోడంబు
క్రోడమునకు దిగువ ♦ గోటిలుబాహు
యుగళి మానినంబు ♦ దగు కకుదంబున
కవల నిదియ పంచ ♦ మాఖ్య పదము॥

తా. వక్షస్థలంబునకు దిగువ క్రోడము క్రోడము క్రింది బాహువుల కకుదమునకు వెనుక ఆసనము ఇదే జీనువేసేస్థలమును ఉండును (ఈ చెప్పబడినదే పంచమక్షేత్రము॥)

ఆ. క్రోడ మధ్యమమున ♦ గుదురగు హృదయంబు
కరయుగంబు మొదల ♦ గక్షయుగము
కక్షములకు వెనుక ♦ గలుగు పార్శ్వంబులు
బెలగు షష్ఠమంపు ♦ క్షేత్రమగుచు॥

తా. శోత్రస్థలంబువెనుక నడుమగా హృదయముండును. బాహువుల మొదల కక్షములు, ఇవే చంకలు, కక్షముల వెంబడినే పార్శ్వములు (ప్రక్కలు) ఇంతవట్టును షష్ఠమక్షేత్రమనఁదును.

ఆ. ఆసన స్థలమున ♦ కనల పృష్ఠం బొప్పు
త్రికము పృష్ఠమునకు ♦ దెసలనొప్పు
హృదయ కుక్షులకును ♦ విదితమై మధ్యను
నాభి వెలయుచుండు ♦ శోభితముగ॥

తా. ముందు చెప్పిన ఆసనస్థలమునకు వెనుక పృష్ఠమును పృష్ఠ పరిసరమున త్రికమును హృదయమునకు కడుపునకు నడుమ నాభియును ఉండును.

ఆ. నాభి పరిసరముల ♦ నలువొంను నుదరంబు
నుదర మిరుగడలను♦నొనరు కోష్ఠ
యుగళి మధ్యములకు ♦ దగు నిది సప్తమ
క్షేత్ర మనగ శాస్త్ర ♦ సిద్ధముగను ॥

తా. నాభికి క్రిందను మీదను ఉదరముండును. ఇదే కడుపు ఉదరమున రెండు ప్రక్కలను పార్శ్వములకు దిగువ కోష్ఠములుండును, ఆసన స్థలమునకు వెనుక పృష్ఠను, హృదయమునకు నుదరమునకు నడుమ నాభిస్థలము (బొడ్డు) ఇంతనట్టు సప్తమక్షేత్రమని చెప్పబడును,

ఆ, ఉదరమునకు దిగువ ♦ విదితమౌ కుక్షిత
న్మూలములను రంధ్ర ♦ ములును వాని
కుత్తరస్థలమున ♦ నుప రంధ్రములు చతు
రంగుళి ప్రమాణ ♦ మగుచు వెలయు॥

తా, ఉదరమునకు దిగువ పొత్తికడుపు అనబడును, కుక్షిమూలమున రంధ్రములును వానిపైన నుపరంధ్రములును నాలుగేసియంగుళములు పరిమాణమై యుండును, ఇవే చిరు డొక్కలని సామాన్యముగా నెంచబడును

గీ. జఘన మొప్పారుఁ ద్రికపార్శ్వ ♦ సంగతముగ
గుద మనంగఁ బుచ్ఛాచ్ఛన్న ♦ మది తదీయ
పార్శ్వముల పిండ యొగ మొప్పుఁ ♦ బరగు నూరు
మూలమున నండములు హాయ ♦ ములకు జూడ॥

తా. త్రికమనగా మొల దాని క్రింద జఘనము (పిరుదు) ఉండును తోక క్రింద గుదముండును, గుదపార్శ్వము పిండములు యెత్తుగా నుండు పిరుదులుండును రెండుతొడల మొదట నండములు నుండును.

గీ. అండముల క్రింద మేహన ♦ మవల ముష్క
గుదములకు మధ్య శీవని ♦ బొదలు చుండ
వాల మొప్పారు గుదముపై ♦ వాహములకు
నష్టమక్షేత్ర మగుదజ్ఞ ♦ లనుమతింప॥

తా. అండముల వద్ద దండముండును అండములకు గుదమునకు మధ్య శీవ స్థలముండును ఈ చెప్పిన కుక్షి మొదలు వాలాంతముగా గల ప్రదేశము అష్టమ క్షేత్రమనఁబడును.

ఆ. ముందు కాళ్ళ బాహు ♦ మూలమ్ములకు గ్రింద
జాను లొప్పుచుండు ♦ జాను జంఘ
కాంత రాళములను ♦ కలలు జాను కపాలి
కములు సంధి ముందు ♦ గలుగు చుండు॥

తా. ముందటి కాళ్ళను చంకల దిగువ జానువులని చెప్పబడును. జాను జంఘలకు మధ్య మోకాటి కీళ్ళు కళ లనబడును. మోకాటి చిప్పలు జాను కపాలికము లనబడును.

ఆ. వెనుక కాళ్ళ యందు ♦ విలసిల్లు చుండు న
య్యూరు యుగము పిండ ♦ యుగము క్రింద
జాను లచట నక్త ♦ జత్రులా క్రిందట
కళలు వాని క్రింద ♦ గలిగియుండు॥

తా. వెనుకకాళ్ళ పిరుదులకు దిగువ ఊరువులు (తొడ) లుండును. వాని క్రింద జానువులు వాని క్రిందజత్రువులు వాని క్రింద శఫలు అనగా మోకాళ్ళుండును.

సీ. నాల్గు కాళ్ళ యందు ♦ నలువొందు మోకాళ్ళ
వరకు గల్గు మీది ♦ భాగమంత
హయ విధాన వేత్త ♦ లది నవమక్షేత్ర
మని చించు చుందు ♦ రశ్వములకు॥

తా. నాలుగు కాళ్ళను మోకాలివరకు మీదిభాగము నవమక్షేత్రమని చెప్పబడును.

క. మోకాళ్ళక్రింద జంఘలు
ప్రాకటమగు వాని క్రింద ♦ బరి హస్తంబుల్॥
ఈ కొలది వెనుక కాళ్ళం
జేకొను స్తూరలను పేరు ♦ చెలువందంగన్॥

తా. మోకాళ్ళ దిగువ ప్రదేశములు జంఘలు (పిక్కలు) జంఘల దిగువ ముందు కాళ్ళకు పరిహస్తములనియును, వెనుక కాళ్ళకు స్తూరలని యును, (పట్టె కాళ్లు) చెప్పబడును.

ఆ. కూర్చలంద్రు పిల్ల ♦ గొరిజల చెంగట
నచటి సంధ బంధ ♦ మగు కిణంబు
కుష్టికంబులచట ♦ గొరిజలపైబడి
ఖురము లచటనుందు ♦ గొరిజలవియ॥

తా. పిల్ల గొరిజలపేరు కూర్చములనియు అచటి చీలమండ కిణమనియు గొటిజపయిన చీలమండ వరకు గలది కుష్టికమనియు దాని దిగువ గొరిజలు (గిట్టలు) ఖురములనియు చెప్పబడును.

క. ఖుర మధ స్థల మద్యోన
బరగన్ శీర్షక యనంగ ♦ భాసుర మగుచుణ్

ధర దశము క్షేత్రంబై
కరమొప్పెడు నింత వట్టు ♦ ఘనుల మతమునన్ ||

తా. ఖురమునకు మధ్యభాగము క్షీరిక యని చెప్పబడును. ఈ చెప్పినంత వట్టు దశమక్షేత్రంబని చెప్పబడుచున్నది.

క. పరమాయువు తురగములకు
జరుగును ముప్పదియు రెండు ♦ సంవత్సరముల్
పరమాయు ర్దశమాంశము
ధరణిం బరికింప నొక్క ♦ దశయనం బరగున్ ||

తా. అశ్వములకు పరమాయువు ముప్పది రెండు సంవత్సరములు. అందు దశమాంశ మొక్క దశయని చెప్పబడును.

గీ. వర్షములు మూఁడు నిరునెల ♦ ల్పదియురెండు
దినములగు నొక్క దశయందు ♦ తెలిసి చూడ
పొసఁగు ప్రథమాదిగా క్షేత్ర ♦ ములకనుక్ర
మంబుగా దశ లొప్పారు ♦ నశ్వములకు||

తా. మూఁడు సంవత్సరములు రెండునెలలు పండ్రెండురోజు లొక్క దశ. ఇది ప్రథమాదిగా నొక్కొక్క క్షేత్రమున కొక్క దశయని చెప్పబడును.

క. మొగమాదిగ మోటులకుం
దగు ప్రథమ క్షేత్ర గణన ♦ దాని విలోమం
బగు గోడిగలకును ఖురా
దిగఁ ప్రథమక్షేత్ర గణన ♦ ధీరమతమునన్.

తా. మోటుల మేన ఫాలాది ఖురాంతము నాదశ క్షేత్రగణన చేయబడుననియు దానికి వ్యతిరేకముగా గోడిగల యెడల ఖురాది ఫాలాంతముగా చేయవలెను.

క. ఏయే క్షేత్రముల సుడు
లాయా దశలందు ఫలము ♦ నందించు హాయా

మ్నాయజ్ఞుల మతమున నీ
చాయ దెలసి ఫలము జెప్ప ♦ జను నెయ్యెడల॥

తా. ఏక్షేత్రమందున్న సుడులు ఆయాదశలయందు ఫలదములగును గాన నిది తెలిసి ఆయాసుడులకు మేలు కీడుఫలములు చెప్పవలెననుట ఇది దశాక్షేత్ర విభాగంబునకు ఫలము.

వ. ఇది దశాక్షేత్ర విభాగం బిక వయోజ్ఞాన లక్షణంబు సెప్పంబడియెడు.

సీ. పుట్టిన నెలలోన ♦ బుట్టు నడిమిపండ్లు
రెండవ నెలనవి ♦ నిండినిలుచు
నాప్రక్క రెండుపం ♦ డ్లలరు మూడవ నెల,
నవి నాలుగవ నెల ♦ వ్యక్తమగును
పారి పక్షద్వయి ♦ బరగు నేనవ నెల,
నవి దృఢంబుగ దోచ ♦ నారు నెలలు
నడిమి పన్నుల దెల్పు ♦ బొడచు నేడవ నెల
తెలుపు మిక్కుటమైన ♦ నెల లెనిమిది

గీ. అవలి పన్నోయి తెల్పు బెం ♦ పారుటకును
తొమ్మిదియు బదినెల లట్లు ♦ దోచు నవలి
పండ్లు బది యొండు బన్రెండు ♦ బరగు నెలలు
వాజికని యశ్వవేత్తలు ♦ బలుకుచుంద్రు॥

తా. పుట్టిన నెలలో నడిమి రెండుపండ్లు పొడమును అవి బాగా పెరిగితే రెండు నెలలు. వాటి ప్రక్కల రెండుపండ్లు మూడవ నెలను పుట్టును అవి బాగ పెరిగిన నాలుగు నెలలు. ప్రక్కపండ్లు అయిదవ నెలను పుట్టును. ఆరవ నెలను బాగా పయికివచ్చును. నడిమి పండ్లకు రెంటను తెల్పుపొడమిన యేడవ నెల. అవి బాగా తెల్పు విరిసిన నెనిమిది నెలలు. ఆప్రక్కపండ్ల తెల్పు పొడమ తొమ్మిది నెలలు. ఆ తెల్పు వ్యాపించిన

పది నెలలు. ఆ ప్రక్క తెల్పుకలిగిన పదునాలుగవ నెల. అవిబాగా తెలుపగుటకు పండ్రెండు నెలలు.

సీ. ఏడాది పిల్ల పం • డ్లెల్ల తెల్లగ నున్న,
నెఱ్ఱనై పండ్లు రెం • డేండ్ల పిల్ల
నడిమి పన్నులు రెండు • బడిరాగ మూడేండ్లు
నా ప్రక్క పండ్లూడి • యట్లరాగ
నాల్గేండ్లు కోర లె • న్నఁగ వచ్చు నంతకు
నైదేండ్ల వయసగు • నశ్వమునకు
పండ్లన్నియూడి యె • ప్పటి రంగి వచ్చి సి,
త ద్యుతి నెంతయు • దళ్క జూప

గీ. వలయు జవసత్వములుగల్గి • వెలయుచున్న
నైదు వత్సరముల వయ • స్సనగ దగును
వ్యంజనము లంత మీదట • వరలుమూడు
వత్సరములకు నొక్కటి • వరుసతోడ॥

తా. పండ్లన్నియు తెల్లగా నున్నది యేడాదిపిల్ల. అవి యెఱ్ఱగానుండెనేని రెండేండ్లపిల్ల. నడిమి పండ్లు రెండును ఊడివచ్చుటకు మూడేండ్లు, ఆ ప్రక్క పండ్లూడి వచ్చిన నాలేండ్లు. కోరలు రెండును వచ్చిన నైదేండ్లు. మోటుగుఱ్ఱము నకేగాని గోడిగకు కోరలు రావు. పండ్లన్నియు నూడివచ్చి తెల్పు గల్గి జవసత్వములు కలిగియుండుట అయిదేండ్ల గుఱ్ఱము లక్షణము. ఆ మీదట వ్యంజనములు కలుగును, ఒక్కవ్యంజనము మూడేసి సంవత్సరములుండును.

ఆ. వ్యంజనములు కృష్ణ • హారిణయు శుక్లయు
కాచ మనల మక్షి • కయును శంఖ
మును నులూఖలంబు • ననచలంబును పాత
మునఁగ దలచె తొమ్మి • దగుచు వరుస॥

తా. కృష్ణ హారిణి, శుక్ల కాచ, శుక్తికా, శంఖ, ఉలూఖల, చల, పార
ఆని తొమ్మిది వ్యంజనములు వరుసగా జనించు.

చ. నడిమి రదంబులం దొడరి ♦ నల్లని రేఖ యొకండు గల్గినం
గదు నది కృష్ణనా వినుతి ♦ గాంచిన వ్యంజన మాఱుయేండ్లగుఁగా
వడి నది ప్రక్కపండ్ల కెగ ♦ బ్రాకిన నేడవ యేడు కోరలం
బొడమిన నెన్మదేండ్లనుచుఁ ♦ బోలెనెఱుంగుదు రశ్వపారగుల్॥

తా. నడిమి పండ్లమీఁద నల్లనిరేఖ గలిగనేని కృష్ణావ్యంజనము. ఇది
ఆరేండ్లగుర్రము. అవ్యంజనమే వాని పక్కపండ్ల గనపడిన నేడేండ్లు.
అవ్యం జనమే కోరలకు గనపడినేని యెనిమిదేండ్ల గుర్రము.

ఉ. పచ్చని రేఖ దా నడిమి ♦ పండ్లను నాపయి పండ్ల గోరలం
జెచ్చెర బుట్టెనేని విల ♦ సిల్లు నిలన్ హారిణీ సమాఖ్యతో
గ్రచ్చర దొమ్మిదిం బదియు ♦ గాఁ బదకొండును గాక వత్సరము
ల్వచ్చు గణింపఁగా హరికి ♦ వాహ విధిజ్ఞ మయూఖియుక్తతన్॥

తా. పచ్చని రేఖ గల్గిన హారిణీవ్యంజనము. అది నడిమి పండ్లను ఆప్రక్క
పండ్లను కోరలను గల్గుట క్రమంబున తొమ్మిది పది పదకొండు వత్స
ముల ప్రాయమని యెఱుంగవలెను॥

ఉ. తెల్లని చుక్క పండ్లపయి ♦ దేరుట శుక్ల యనంగ వ్యంజనం
బల్లది మధ్యదంతముల ♦ నావల పండ్లను కోరలం దొగిం
జెల్లిన వత్సర సంఖ్య విల ♦ సిల్లును ద్వాదశముం త్రయోదశం
బల్ల చతుర్దశంబు నని ♦ యశ్వ వయః పరిమాణ సంగతిన్॥

తా. తెల్లనిచుక్కవలె రేఖగనుపించుట శుక్లవ్యంజనము. ఇది వైరితిన్
నడిమి ప్రక్కదంతములను కోరలను గన్పట్టిన బంగ్రెండు, పదమూడు
పదునాల్గు సంవత్సరముల వయస్సని యెఱుంగవలయును.

గీ॥ గాజు వన్నెంపు రేఖయా ♦ కాచ మనెడి
వ్యంజనం బది మునిపండ్ల ♦ ప్రక్కపండ్ల

గోరలను గల్గు బడియేండ్ల . బాలు బడియు
నేడు వత్సరములుపగు . నిడుహరికి॥

తా. గాజుకణమైన రేఖ కాచవ్యంజనము. ఇది నడిమిపండ్లను ప్రక్క పండ్లను గోరలను గలిగిన పదిహేను పదారు పదియేడువర్షములు ప్రాయమని తెలియవలయును.

ఆ. పలయు నీగవోలె . మక్షికా వ్యంజనం
బసి బరాన్మి మొది . యగు త్రివర్ష
యుక్తి నడిమిపండ్ల . నొగి బ్రక్కపండ్లను
కోరిపక్షములను . బరిగియుండు॥

తా. ఈగ వ్రాలినట్లున్న చుక్క మక్షికావ్యంజనము నిలచిన బదునొని మిది బందొమ్మిది యిరువది యేండ్లగుర్రము అని తెలియవలెను.

ఆ. శంఖ సదృశ రేఖ . శంఖాఖ్య వ్యంజనం
బడియు నేక వింశ . మాది మూడు
వత్సరముల నడిమి . ప్రక్కదంతంబులఁ
గోరలను వసించు . ఘోటములకు॥

తా. శంఖమువంటి రేఖ శంఖవ్యంజనము ఇది నడిమి ప్రక్క దంతము గోరలను గలిగిన నిరువదియొకటి యిరువదిరెండు యిరువదిమూడు సంవత్సరములు వయస్సని యెఱుంగవలెను.

ఆ. పండ్ల తుదల గుంట . పడియుండుటే యులూ
ఖల మనంగ నిదియుఁ . గలుగుటట్లు
మూఁడు గడల పండ్ల . మొదలిరువదినాలు
గాని వత్సరత్ర . యావధియగు॥

తా. పండ్ల మీఁదను చివరలను రోటవలె గుంటలుపడుట అరుగుడుపండ్ల గుంటలూఖల వ్యంజనము. ఇదియు బయిన చెప్పినట్లే నడిమి ప్రక్క

పండ్లను గోరలను గలిగిన యిరువదినాలుగు యిరువదియైదు యిరువదియారు వత్సరముల ప్రాయమని యెఱుంగవలెను.

గీ. పండ్లు కదలుట చలమను ♦ వ్యంజనంబు
నడిమి పన్నోయి ప్రక్కదం ♦ తముల బోరి
వక్షముల గల్గి యట నిరు ♦ వదియు నేడు
మొదలు మూడేండ్లు క్రమముగ ♦ గదియు చుండ॥

తా. పండ్లు కదలుట యే చలవ్యంజనము అదియు నట్ట నడిమి పండ్లు ప్రక్కపండ్లు కోరలు కదిలెనేని క్రమముగా యిరువదియేడు యిరువది యెనిమిది యిరువది తొమ్మిది సంవత్సరముల వయస్సని యెఱుంగ వలెను.

ఆ॰ పండ్లు రాలి పోక ♦ పాతాఖ్య వ్యంజనం
బదియు నడిమిపండ్ల ♦ నవలి పండ్ల
కోరలందుఁ గలిగి ♦ వారక ముప్పది
మొదలు మూఁడువర్ష ♦ ములు ఘటించు॥

తా. పండ్లురాలిపోవడమే పాతవ్యంజనము ఇది నడిమి పండ్లూడినముప్పది యేండ్లనియు వాని ప్రక్కల పండ్లూడిన ముప్పదియొక్క యేడనియు గోరలూడిన ముప్పదిరెండేండ్లనియు చెప్పదగును. ఈవ్యంజనదంతములలో కడవానిసే ఇందు కోరలని వాడినారు, ఇవి గాక కోరలు వేరే వీటి ప్రక్కను యింకను రెండుండును.

క. తురగ వయో జ్ఞానమ్మున
కరయగ వ్యంజన విధాన ♦ మదియొకటే సు
స్థిర లక్షణ మిది యభ్యం
తర విజ్ఞానమని కీర్తి ♦ తంబగు నెందుఁ॥

తా. అశ్వ వయోజ్ఞానమునకు వ్యంజనజ్ఞానమే ముఖ్యము ఇది అభ్యంతర జ్ఞానమని చెప్పబడును.

ఆ. ఒడలు చూచి యెరుగు • టొనరు బాహ్యజ్ఞాన
మది సునిశ్చితార్థ • మగుటచాల
దుస్తరంబుగాన • నిస్తులాభ్యంతర
జ్ఞానమెరుగనదియె • చాలునెంచు ॥

తా. ఒడలు చూచి వయస్సు తెలిసికొనుట బాహ్యజ్ఞాన మదినిశ్చయము గా తెలిసికొనుట కష్టము. కాబట్టి దానిని విడిచి యీ యాభ్యంతర జ్ఞానమువలన తెలిసికొనుటయే చాలునని చెప్పబడినది.

వ ఇది వయోజ్ఞాన లక్షణం బింక జికిత్సాప్రకారంబు ప్రస్తావనావశ్యం బైనను దీని కీవేర నొక కొన్ని గ్రంథము లిదివరకె ప్రచురింపబడి యుండుటచే నిచ్చట మరల బ్రతిపాదించుట గ్రంథ బాహుళ్యంబు గాక మరియొక ప్రయోజనంబు గలుగమింజేసి యది సంక్షేపించి యశ్వంబులకు లవణ కవణ విధానంబు మాత్రము చెప్పంబడుచున్నది.

క. లవణం బాయుష్యము సైం
ధవముల కది గాన దర్వి • ధానము దెలియన్
సువిహిత బుతుషట్కంబుల
దవిలి యొసగ వలయు నశ్వ • తత్వజ్ఞులొగిన్॥

తా. అశ్వములకు నుప్పు పెట్టుటాయుర్వృద్ధి కారణంబు గాన నాఋతువులయందు దత్తద్విధానము లెరిగి యుప్పు పెట్టవలయును.

గీ. ఉప్పు పూర్వాహ్ణ వేళల • నొప్పు బెట్ట
నరుచియును గ్లాని శూల మం • దాగ్ని మొదలు
దోషముల నెల్లబోవగా • ద్రోచి యది ని
రామయం బిచ్చు నెయ్యెడ • నశ్వయులకు॥

తా. ఉప్పు ప్రొద్దుటి జామున పెట్టవలెనని యు నందుచే అరోచకము బడలిక శూల మందాగ్ని మొదలయిన దోషములు పోయి ఆరోగ్యము గలిగియుండును.

ఆ. ఐదు పలములు లుప్పు ♦ హయముల కుత్తమం
బందు నాల్గు మధ్య ♦ మాశ్వములకు
నధమమంద్రు మూఁడు ♦ హరులకు నీరీతి
పరిమితంబు లవణ ♦ పద్ధతులకు॥

తా. ఉత్తమాశ్వములకు అయిదు పలములే యుప్పు పెట్టవలెను. సామాన్యములకు నాలుగు పలములు. అధమము మూడు పలముల యుప్పు పెట్టవలయును.

సీ. హేమంతమును ను ♦ ప్పిడిదుడు వావిలియాకు
గలపి యశ్వములకు ♦ జలమొసంగ
శిశిరర్తువున నుప్పు ♦ చేదు పొట్లనుగూర్చి
పెట్టినరోగముల్ ♦ పీచమణగు
నలవసంతము నేల ♦ ములక సమూలంబు,
లవణము గూర్చిడ్డ ♦ లావుగలుగు
గ్రీష్మర్తువున నుప్పు ♦ ఘృతయుక్తముగ బెట్ట
నాయురారోగ్యమ్ము ♦ లధికరించు

గీ. వర్ష ఋతువున వేపాకు ♦ వలన నుప్పు
బెట్ట నశ్వమ్ములకు గడు ♦ మేలు సేయు
గడు శరత్కాలమున గాడ్దె ♦ గడపయాకు
నుప్పు బెట్టిన వాజుల ♦ కొప్పుసేయు॥

తా. హేమంతఋతువులో వావిలాకుతోడను, శిశిరఋతువులో చేదు పొట్లతోడను, వసంతఋతువులో నేలములకతోడను, గ్రీష్మఋతువులో నేతితోడను, వర్షఋతువులో వేపాకుతోడను, శరదృతువులో గాడిదెగడపాకుతోడనుగలిపి అశ్వముల కుప్పు బెట్టవలయును.

సీ. కరకయు తాడి యు ♦ పరికాయలివి గూడి,
త్రిఫలంబులననగ ఘా ♦ త్రిని బొసంగు

పాలు నూనెయు తేనె । పానీయములు యవ,
క్షారంబు మధువును ♦ గలిపి వరుస
శరదాది ఋతుషట్క ♦ సమయంబుల నొసంగ
సకల దోషముల గ్ర ♦ చ్ఛర నడంచి
యాయురారోగ్యమ్ము ♦ లధిక ఫలంబును,
గావించు హరులకు ♦ గ్రమముతోడ

గీ. త్రిఫల చూర్ణమిట్టు ♦ తేజాన కిడవలె
నశ్వ శాస్త్ర వేత్త ♦ లైన వారు
దీని పేరసంగు ♦ దివ్య హరీతకి
యనగ సైంధవముల ♦ కమృత సమము॥

## కవణ ప్రకారము.

క. సెనగలు గుర్రములకు నొ
ప్పిన కవణము వీని నాన ♦ బెట్టి యిడవలెన్
గన వేసవివేళల ద
ప్పిన యెడలం దుడుక బెట్టి ♦ పెట్టఁగ వలయున్॥

తా. సెనగలు దాణాకు ముఖ్యము. అవి వేసవికాలమున నానబెట్టియు దక్కిన కాలముల నుడకబెట్టియు పెట్టవలెను.

క. ఉలవలు తెలిజొన్నలు పెస
లలచందలు యావలు కవణ ♦ మగు సెనగలుగ్రం
తల దొరకని యెడ జలిలో
నులవ లుడక బెట్టి పెట్టు ♦ టొప్పు హరులకున్॥

గీ. మొలచినవి పుచ్చినవియును ♦ ముక్కినవియు
వేచినవియును ♦ కవణంబు వేయరాదు
దక్కఁగా నుడకబెట్టియు ♦ చల్లనార్చి
పేర్మి మీరంగ కవణంబు ♦ పెట్టవలయు॥

గీ॥ పాము కుబుసంబు విఱుతక ♦ ప్పలును గలది
నానినది కుళ్ళినది చెడి ♦ నదియు గాని
గడ్డి యహారంబు సైంధవ ♦ గ్రామణులకు
బలము నాయు వరోగత ♦ వలసి రేని॥

క. అసులు మురిగిన నీళ్ళను
గ్రాగొన్న జలంబు జలగ ♦ పట్టిన నీరున్
గాక గల నీరు హయముల
కేకడ నిడరాదు బలము ♦ హితమగు నేనిన్॥

క. ఈ కరణి నెఱిగి కవనము
చేకొని యొసఁగుచును బ్రీతిచే ♦ నశ్వములన్॥
సాకెడు వారల కెంమున
నాకుల వైభవ సమృద్ధు ♦ లబ్బు గరంబున్॥
నెనిమిది నూఱులి ♦ రేఁడియు మూఁడు

నరనుతసుకవికథాకర
వరహృదయావాసభర్గ • పావనచరితా॥

## మంగళమహాశ్రీ వృత్తము.

శ్రీకరసమస్తనృప • శేఖరమహాగుణ • శీకరజగద్వినుతచర్యా
ప్రాకటయశఃకుసుమ భాసురదిగంతరశు• భస్థిర మహావిభవధుర్యా
లోకనుతసద్విబుధ•లోకపరిపాలనవి• లోకనమనీషి జనవర్యా
శ్లోకమనసంద్య గుణ జాలమహిమాన్వితభుజంగ నృపమంగళ మహాశ్రీ॥

సంపూర్ణము.



## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A101 B142 |
| పుస్తకం పేరు | అగ్నిలక్షణ సౌర గుణగణాలు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, Q, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Nava |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| [illegible] | good |